


PHONE
62420

# కామధేను

టెక్స్‌టైల్ కాంప్లెక్స్

మిల్లు వస్త్రముల ప్రత్యేక షోరూమ్

బీసెంట్ రోడ్,
విజయవాడ -520 002

వే 1977



సంపుటి 15
సంచిక: 4

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు:
కీ. శే. వి. వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్:
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

సహకార సంపాదకుడు: వేమూరి సత్యనారాయణ

# విషయ సూచిక



ముఖచిత్రం: "బంగారు బొమ్మలు"లో మంజుల.

జ్యోతి, 40/1 మూసాసేట్ స్ట్రీట్, టి. నగర్, మద్రాసు-600017.
ఫోన్: 440548. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో) రు. 42/-.

# ఆకర్షణీయమైన ప్రత్యేక పథకం

జ్యోతిలో ప్రచురితమయిన 'కథ'లలో ప్రతినెలా రెండు ఉత్తమ కథల నెన్నికచేసి, జ్యోతి, మామూలుగా యిస్తున్న పారితోషికం కాక అదనంగా ఆ రెండు కథలకూ ఒక్కొక్క కథకూ రు. 75/- చొప్పున ప్రత్యేక పారితోషికం అందిస్తోంది జ్యోతి.

అంతేకాదు—అలా ప్రత్యేక బహుమతులు పొందిన కథలలో మూడింటికి— సంవత్సరాంతాన— జ్యోతి సంవత్సర బహుమతులక్రింద (మొత్తం 12 నెలలలో ప్రత్యేక పారితోషిక పొందిన 24 కథలలో)

ఉత్తమ కథకు రూ. 500/-, ద్వితీయ ఉత్తమ కథకు రూ. 250/-, తృతీయ ఉత్తమ కథకు రూ. 116/- ప్రత్యేక బహుమతులు అందజేస్తుంది జ్యోతి.

జ్యోతిలోని ఉత్తమ కథల ఎన్నిక జ్యోతి సంపాదకులు కాకుండా, అయిదుగురు ప్రముఖ రచయితలతో కూడిన ఒక కమిటీ చేస్తుంది.

ఈ పథకం ఏప్రియల్ 1977 సంచిక నుంచీ ప్రారంభించబడింది.

ఏప్రియల్ '77 సంచికలో ప్రత్యేక పారితోషికం
పొందిన కథలు

అనర్హతకు హద్దు — రచన: ప్రశాంత
బంధితుడు — రచన: కె. మాధురి

# తొలిమాట

గత సంచిక జ్యోతి విడుదలయేనాటికి భారతదేశంలో ఆరవ లోక్‌సభకు సాధారణ ఎన్నికలు జరగబోతున్నాయి

ఈ సంచిక పూర్తయేనాటికి ఆ సాధారణ ఎన్నికల ఫలితాలు అసాధారణమై బయట పడ్డాయి స్వాతంత్ర్యానంతరం ముప్పై సంవత్సరాలుగా అవిచ్ఛిన్నంగా భారత దేశాన్ని పరిపాలించిన కాంగ్రెసు పార్టీ ఓడిపోయి స్వతంత్ర భారత చరిత్రలో తొలి సారిగా కాంగ్రేసేతర పక్షంచే ప్రభుత్వం స్థాపించబడింది ఎన్నికల ప్రకటన తేదీ నుంచీ క్షణక్షణం అద్భుతమైన రీతిలో ఎన్నికల వాతావరణంలో మార్పులు జరిగాయి దాదాపు ఇరవై నెలలుగా భారతదేశంలో వున్న 'అంతరంగిక అత్యవసర పరిస్థితి' వల్ల ఇంతకాలమూ వింటున్న లాభాలు కాక నష్టాలే ఎక్కువన్న వార్తలు ప్రభంజనంలా దేశాన్ని చుట్టుముట్టాయి హఠాత్తుగా కాంగ్రెస్ ప్రభుత్వంలోని ముఖ్యుడు బాబూ జగజీవన్‌రాం మరికొంత మంది కాంగ్రెస్ ప్రముఖులతో కలిపి కాంగ్రెస్ నుండి విడివడి ప్రజాతంత్ర కాంగ్రెస్ అన్న పార్టీ పెట్టడంతో కాంగ్రెస్ పార్టీ స్థితి విషమస్థితిలో పడింది దేశంలో తల ఎత్తిన నియంతృత్వ ధోరణులకు నిరసిస్తూ ప్రత్యామ్నాయ ప్రభుత్వం స్థాపించే స్థిర నిశ్చయంతో నాలుగు ప్రతిపక్ష పార్టీలు విలీనమై ఏర్పరచిన జనతా పార్టీతో చేయి కలిసింది ప్రజాతంత్ర కాంగ్రెస్ ఫలితం కాంగ్రెస్ పతనం పదకొండు సంవత్సరాలుగా ప్రధాని పదవి నిర్వహిస్తూ బ్యాంకుల జాతీయకరణ రాజభరణాల రద్దు మొదలైన ఎన్నో అభ్యుదయకరమైన పనులు సాధించి బంగ్లాదేశ్ విమోచన సందర్భంగా వీరోచితమైన పాత్ర వహించింది శ్రీమతి ఇందిరాగాంధి అయితే గత 20 నెలలుగా జరిగిన అధికార దుర్వినియోగం ఫామిలీ ప్లానింగ్ పేరుతో జరిగిన రాక్షస చర్యలూ ఎమర్జెన్సీ వల్ల కలిగిన మరెన్నో దుష్ఫలితాలు ప్రజలు సహించలేక పోయారు ఫలితంగా శ్రీమతి ఇందిరాగాంధీ తన ప్రభుత్వాన్నే కాదు తన పార్లమెంటు సీటునే నిలుపుకోలేక పోయారు

భారత ప్రజలు ప్రజాస్వామ్యాన్ని ఎంత బలంగా కోరుకొంటున్నారో నిరూపించిన యీ ఎన్నికలు మరో సత్ఫలితాన్ని సాధించాయి దేశాభివృద్ధికి జరిగే కృషిలో లెక్కకు మించిన రాజకీయ పార్టీలు గాక అతితక్కువ సంఖ్యలో బలమైన రాజకీయ పార్టీలు-రెండే పార్టీలైతే మరింత మంచిది-ఏర్పడేందుకు పునాది పడింది

ప్రజల తీర్పునుంచి ప్రతిపక్షమైన కాంగ్రెస్ పార్టీనే గాక ప్రభుత్వ పక్షం కూడా పాఠాలు నేర్చుకోవాలి ప్రభుత్వమూ ప్రతిపక్షమూ కలిసే కృషిచేసి భారత దేశాన్ని సౌభాగ్యవంతంగా తీర్చి దిద్దగలవని ప్రజలు ఆశగా ఎదురు చూస్తున్నారు

వె. గోపాలకృష్ణయ్య

# ఉత్తరాలు

మీరు మహిళాజ్యోతిని నిర్వహించబోతున్నందుకు, ప్రత్యేకంగా అందుకోసం చేయవలసిన రచనల గురించిన మీ సంపాదకీయం మమ్మల్ని చాల ఆనందపరిచింది. "మీరు విన్నారా?" కవితగారి యదార్ధ కథ చదివి ఆశ్చర్యపోయాం. ఎందుకంటే ఆ కథ ఇటీవల విడుదలైన "సంచలనం - నిశ్చలనం" అనే రెండు నవలికల పుస్తకంలో "నిశ్చలనం" పేరిట రాయబడింది. రచయిత శ్రీ పి. చంద్రశేఖర అజాద్ తన మాటలో రాస్తూ, "వీటిని గురించి నేనేం చెప్పదలుచుకోలేదు. ఇవి కథలు కావు. బలి అయిన యదార్థ జీవితాలు" అన్నారు. "జ్యోతి" చూచినాక అతని "సిన్సియారిటీ" ని అభినందించకుండా ఉండలేకపోయాము.

ఇందులో నారాయణశర్మ ఆవేశానికి బలి అయిన ఉమను ఎంతో గొప్పగా తీర్చిదిద్దారు. శర్మ ఉమను వెంటాడుతుంటాడు. తరుముతుంటాడు. అయినా ఒక్కరూ మాట్లాడరు. మూగగా చూస్తుంటారు. అప్పుడు కన్నీటిబొట్టు రక్తపుబొట్టుతో కలిసి అడుగుతుంది.

"ఓ సమాజమా, ఓ మనుషులారా,

# రచయితలకు విజ్ఞప్తి!

పరిశీలనకొరకై జ్యోతికి రచనలు పంపేవారు ఈ క్రింది సూచనలు గమనించి సహకరించ గోరుచున్నాము.

రచనలు కాగితానికి ఒకవైపునే రాయాలి. రచనతోపాటు స్వంత చిరునామా గల స్టాంపులంటించిన కవరు జతపరచాలి. అలా కవరు జత పరచబడని రచనలు త్రిప్పి పంపటం సాధ్యపడదు. జ్యోతి ఆఫీసుకి స్వయంగా వచ్చి రచన లందజేసేవారు కూడా యీ సూచన పాటించాలి.

జ్యోతిలోని వివిధ శీర్షికలకు రచనలు పంపేటప్పుడు కవరుపై ఆ శీర్షిక పేరుతో పంపడంవల్ల త్వరగా రచనలు పరిశీలించే అవకాశ ముంటుంది.

కథల పరిశీలన రెండు నెలల లోపుగా జరుగుతుంది సాధారణంగా. మరింత. త్వరగా ఈ పరిశీలన జరిపేందుకు ప్రయత్నిస్తున్నాము. ఆ కారణంగా రెండు నెలల లోపు 'మా రచనేమైందంటూ' ఉత్తరాలు రాయడం వలన ప్రయోజనముండదు.

రచనలతోపాటు ఆ రచన మీ స్వంతమేకానీ, ఇతర రచనలకు అనుసరణగానీ అనువాదం కానీ కాదనీ, మరే ఇతర పత్రికకూ ఆ రచనను పంపి వుండలేదనీ హామీపత్రం విధిగా జతచేయాలి. ప్రచురించబడినవిగానీ, కాపీ రచనలుగాని పొరపాటుగా ప్రచురణ జరిగినా, ఆ విషయం నిరూపించ బడితే ఆయా రచనలకు పారితోషికం ఏ పరిస్థితులలోనూ ఇవ్వబడదు.

నవలల పరిశీలనకు, మిగతా రచనల పరిశీలనకంటే కొంచెం ఎక్కువ వ్యవధి తీసుకొంటుంది. గమనించగలరు.

ప్రచురణకు స్వీకరించిన వెంటనే రచయితలకు ఆ విషయం తెలియ పరుస్తాము. ప్రచురణ వీలు వెంట జరుగుతుంది.

—ఎడిటర్

అదిగో...ఆ స్త్రీ...మీ సమాజంలో స్త్రీ... మీ తల్లి .... మీ అక్క— మీ చెల్లి — మీ భార్య. అదిగో సృష్టికి మూలకారణ మయిన స్త్రీ మీరు గౌరవించని స్త్రీ మీరు ఆదర్శాలు వల్లెవేసే స్త్రీ .. మీరు గొప్పగా చెప్పుకొనే సంస్కృతిలో— మీరు పొంగిపోయే వ్యవస్థకు, మీరు యిచ్చే గౌరవానికి, ప్రతీకారానికి ప్రతి బింబంగా వేటాడబడుతుంది. వెళ్ళండి. ఆపండి. ఆ ఘోరం ఆపండి."

సమాజంలో కరడుగట్టిన స్తబ్ధతకు సజీవ చిత్రణ. ఎవ్వరూ మాట్లాడరు. ఉమ బలి అయిపోతుంది. చదివిన తరు వాత హృదయాలు బరువెక్కుతాయి.

ఆలోచింప చేస్తాయి. "పురాణం" గారన్నట్లు దృశ్యాల్లో కళ్ళముందు కదిలిపోతాయి. మనం చూస్తుండగానే ఉమ బలి అయిపోతుం దనిపిస్తుంది. పాఠకుల మనస్సులలో ఓ చిత్రం తయారవుతుంది. ఓ సమస్య ఉదయిస్తుంది. చివరిగా రచయిత అంటాడు.

"దీనికంతటికి కారణం ఈ వ్యవస్థ. నారాయణశర్మ నేరస్థుడు కాడు. ఎవరూ కారు. నేరం, స్వార్థం ఈ వ్యవస్థ స్వరూపంలో ఉంది. అందుకే స్త్రీ ఇక్కడ సమస్య అయింది.

నిశ్చలించిపోయిన ఈ సమాజం, క్రుళ్ళి మురుగు పేరుకుపోయి కంపు కొడుతున్న ఈ వ్యవస్థనుంచి తనను కాపాడుకోవటానికి, "తన గౌరవాన్ని అభివృద్ధి పరచుకోవటానికి, విలువను సృష్టించుకోవటానికి అబల అనుకోక స్త్రీ సంచలనంగా, ముందుకు దూకుతుందా? నవసమాజ నిర్మాణంలో భాగం పంచుకుంటుందా?" అని ప్రశ్నిస్తూ ముగిస్తాడు.

ప్రతి మహిళ చదివి తీరవలసిన రచనలివి.

—"మహిళ", తెనాలి.

(గత సంచికలోని మీరు విన్నారా శీర్షికలో ప్రచురించబడిన "కవిత"గారి యదార్థఘటన ఈ ఉత్తరంలో ప్రస్తావించబడిన నవలా ఇతివృత్తా లొకటే అయిన సంగతి మా దృష్టికి తెస్తూ మరి కొన్ని ఉత్తరాలు వచ్చాయి. ఇది యదార్థ సంఘటనకు రూపకల్పన గనుక ఒకరికి తెలియకుండా ఒకరు రాసివుండవచ్చునని భావించాము. యదార్థ సంఘటనలయినా ఇదివరకు ఏ రూపంలోనూ ప్రచురితంగానివీ పంపవలసిందని రచయితలకు విన్నవిస్తున్నాము. —ఎడిటర్)

# మహిళా 

# ఆడదాన్ని ఉద్ధరించాలా!

## ఎలా? ఎందుకు?

ఆ మధ్య ఎవరో పత్రికతను పనిగట్టుకొని మండుటెండలో పదిమైళ్ళు నడిచి ఓ ముష్టివాడ్ని ఇంటర్వ్యూ చెయ్యడానికి వెళ్ళేట్ట. ఆ మాటా యీ మాటా మాట్లాడి "బాబూ, నీకున్న కష్టాలేఁవిఁటి?" అని అడిగేట్ట. దానికా ముష్టివాడు తన పనంతా పాడైపోతున్నట్టు కళ్ళెర్రజేసి, ఎగాదిగా చూపి "సూడు బాబూ! సూపుకి నువ్వు సదూకున్నోడిలాగే వున్నావ్. నీకామాత్తరం తెల్దేటి? అల్లదుగో. అటు సూడు. ఆ మేడలో యిస్రాంతి తీసుకుంటున్నాడే దొరబాబు. ఆ బాబునడుగు ఆ బాబుకున్న సుకాలేటో. ఆయన ఏఁటేటి సెప్తాడో అయన్నీ నాకు నేవు. అయ్యే నా కట్టాలు" అన్నాట్ట అతి తేలిగ్గా యింటర్వ్యూ ముగించేస్తూ.

అలా వుంది ఇప్పటి నా పరిస్థితి. ఆడవాళ్ళ గురించి రాయమంటే నాకేం తోచడంలేదు. సరికదా అసలెందుకు రాయాలో కూడా అర్థం కాలేదు. బహుశా నేనూ ఆడదాన్నే అవబట్టేమో! అంచేత ఆ ముష్టివాడి థియరీ ప్రకారం నేటి ఆడవాళ్ళ కష్టాలు మగవాళ్ళద్వారా రాబట్టగలనేమో అన్న ధీమాతో మావార్ని ఓ మంచి మూడ్‌లో చూసి పట్టుకున్నాను.

"ఏవండీ. మా ఆడవాళ్ళ కష్టాలేఁవిఁటీ" అన్నాను వీలైనంత అమాయకంగా.

ఆయన నన్నోసారి అడ్డంగానూ, మర్రోసారి నిలువుగానూ చూపుల సర్వే చేసి "చూడమ్మీ. నీ బాధలేఁవిఁటో నాకు తెలీదు! ఇలా అంటున్నానని బాధపడకు గాని యు మస్ట్ బి ఎషేమ్డ్ ఆఫ్ యువర్ యిగ్నొరెన్స్ (You must be ashamed of your ıgnorance) ఆయన కొట్టేముందు కత్తికెప్పుడూ తేనెపూస్తారు.

నాకు నిజంగానే సిగ్గేసింది. ఆయనలా అన్నందుక్కాదు. నేనా పరిస్థితిలో వున్నందుకు ఎంత నిజం! ఎన్ని శతాబ్దాలు గడిచినా, మనం ఎక్కడున్నామో మన మంచిచెడ్డలేఁవిఁటో తెలీని "ప్యూపా" దశలోనే యింకా వున్నాం కదా అని మనసులో బాధ వేసింది.

బీ నా దే వి

ఆయన ఏమనుకున్నారో ఏమో! అను నయంగా మళ్ళీ పిలిచి, "చూడమ్మడూ. పోనీ నీకున్న దేమిటో అదైనా తెలుసా?" అన్నారు.

"తెలీదు" జవాబు ఆయనదే.

"నీకు తెలిసిందల్లా మొగుడ్ని దుయ్యబట్టుకోవడం. మగాడికేవో సహజ కవచ కుండలాలూ, పంచభక్ష్య పరమాన్నాలూ వున్నాయనీ, అవి మీకు లేవనే ఏడుపే కాని, అసలవి మీకు అవసరమా, మీకేం కావాలి? అదెలా వస్తాయి అన్న ఆలోచనే లేదు. సో యు డిసెర్వ్ యువర్ పొజిషన్ ఎండ్. ."

ఆ తరవాత నా కింకేవీ వినిపించలేదు.

అవును. అసలు ఆడదానికేం కావాలి?

అసలేం వున్నాయి?

ఏం వున్నా లేకపోయినా బోలెడు సమస్యలు మాత్రం వున్నాయి.

మగాడిలా ఆడదానికి తిండి, ఇల్లు, చదువు, బట్ట, సినీమా, సెక్సు వగైరా కావల్సినా, ఆడదానికి అతి ముఖ్యమైనది పెళ్ళి అని అనాదిగా అందరిలోనూ ఓ అతి పవిత్రమైన మూఢనమ్మకం వుంది. పెళ్ళంటూ అయితే తతిమ్మావన్నీ ఆటోమేటిక్ అని అనుకునేవాళ్ళే ఎక్కువ. అంచేత దానిగురించే ముందుగా మాట్లాడుకుందాం.

తీగ లాగితే, డొంకతోపాటు ఒక్కోసారి దాని వేళ్ళుకూడా కదుల్తాయి.

ప్రేమకి, పెళ్ళికి అవినాభావ సంబంధం వుంది. ప్రతి ప్రాణికి-మనిషికి, పక్షికి, పశువుకి ఆఖరికి మొక్కకూడా-ప్రేమ సహజం, అవసరంకూడా. మనిషి మనుగడకి గాలీ, నీరూ ఎంత అవసరమో, ప్రేమా అంతే. కాని, అదే గాలి పెనుగాలిగా మారినా, అదే నీరు వరదై పారినా మనిషి అందులో పడి కొట్టుకుపోవడం మినహా చేసేదేంలేదు. ప్రేమ కూడా అంతే.

ఆడదైనా, మగాడైనా అలా జీవితాంతం కనిపించినవాళ్ళందర్నీ ప్రేమించుకుంటూ పోతే అంతుండదు. ఉపయోగం అంతకంటే వుండదు.

వరదలా పారే నీటికి ఆనకట్ట అడ్డులా వేసి ఆ నీటిని సద్వినియోగం చేసుకోవాలి. అలాంటి ఆనకట్టలాటిదే ప్రేమకు పెళ్ళి. అంతే కాదు. ప్రేమను మత్తు మందులా సేవించేవాడికి పెళ్ళనేది వో విరుగుడు లాంటిది.

అసలు ఎవరైనా ప్రేమించ దలచుకుంటేనే పెళ్ళి చేసుకోవాలి.

పెళ్ళిచేసుకో దలచుకుంటేనే ప్రేమించాలి.

మరైతే అంతమందీ ప్రేమించే పెళ్ళి చేసుకుంటున్నారా? అన్న ప్రశ్న వస్తుంది.

లేదు. నిజమే.

నీరు వస్తుందన్న ఆశతో ఆనకట్టలు కట్టేస్తే నీరు వస్తే వస్తుంది. లేకపోతే లేదు. పెద్దవాళ్ళు కుదిర్చిన పెళ్ళిళ్ళల్లో ఎంతమంది పెళ్ళైన తరవాత ప్రేమించుకుంటున్నారు? మరైతే వాళ్ళంత సుఖంగా బతకడం లేదా అనొచ్చు, లేకేం బతుకుతున్నారు. మరో గతిలేక. పెళ్ళనేది చాలా పవిత్రమైనదనీ, ఎన్ని బాధల

పడినా తన స్థానం భర్త ఇంట్లోనేననీ, పాదాలదగ్గర చోటు లేకపోతే కనీసం పాదాల కిందనైనా సరే యింత చోటు దొరికితే అదే మహాప్రసాదమనీ భావించే బలిచక్రవర్తుల స్టేజిని మనం యింకా దాటలేదు ఇవన్నీ కేవలం మత పరంగా కొన్నివేల ఏళ్ళనుండి మనలో పాతుకు పోయి, వేళ్ళూ, ఊడలు తన్నిన నమ్మకాలు. ఇవన్నీ మూఢ నమ్మకాలనీ, మూర్ఖత్వాలనీ ఎవరు ఎంత నచ్చచెప్దామన్నా ఎవరూ వినరు సరికదా ఆ చెప్పిన వాళ్ళేదో చెడిపోయినట్టు భావిస్తారు.

కాని అదే ఏ శంకరాచార్యో, సాయి బాబానో వచ్చి "ఈ పెళ్ళి, పవిత్రం వగైరాలన్నీ చెత్తనీ, వీటిని నమ్మవద్దనీ, ఫలానా వేదంలోనో, పురాణంలోనో వుంది. మరంచేత మీ కిష్టమైతేనే వుండండి లేకపోతే పొండి" అని ఒక్కసారి అంటే నూటికి తొంభై తొమ్మిదిమంది "వెళ్ళొస్తాను" అనైనా చెప్పకుండా మొగుళ్ళని వదిలేస్తారు.

రేడియోని కనిపెట్టిన మార్కోనీలా, అమెరికాని కనిపెట్టిన కొలంబస్‌లా 'పెళ్ళి' ఎవరూ కనిపెట్టలేదు అలాగని సైన్సుకిమల్లే దానికేం థియరీలూ లేవు. పెళ్ళనేది ఒక ఇన్‌స్టింక్ట్ (Instinct). కేవలం (Evolution)లో వచ్చిన ఒక Event). అందుకే ప్రపంచం అంతటా 'పెళ్ళి" ఒకే రకంగాలేదు. పెళ్ళి, డబ్బు యీ రెండు మనిషి తయారుచేసినవి. వాటి విలువలు రోజు రోజుకూ మారి పోతున్నాయి.

"పెళ్ళి పవిత్రమైనది. అందులో వేదోక్తంగానూ అగ్నిసాక్షిగానూ చేస్తే అది పరమపవిత్రం" అంది హిందూమతం

పెళ్ళిని-"ముత్యాల పల్లకీ, మల్లెపూల పానుపు, ఓరచూపులు, ఒళ్ళు పులకింతలు" అంటూ అదో అందమైన అనుభూతిగ వర్ణించేరు కవులు.

దాంతో పెళ్ళిపేరు చెప్పగానే ఆడ పిల్లలు అనవసరంగా సిగ్గుపడి పారిపోవడాలు, పెళ్ళి నిశ్చయం అయిందనగానే మరింకేమీ ఆలోచించక, రాత్రనక పగలనక కలల్ని, ఆ తరువాత పిల్లల్ని కనేయడం చాలా పరిపాటైపోయింది.

అసలీ కలల పైత్యం ఆడదానికే ఎక్కువేమో.

కొంచెం లోతుగా ఆలోచిస్తే, కొంత మోటుగా వినిపించినా, పెళ్ళనేది ఒక వ్యాపారం తాలూకు కాంట్రాక్టు మాత్రమే. నిజానికది ఆడది మొగాడికి రాసిచ్చే ప్రామిసరీ నోటు. ఎటొచ్చీ ప్రామిసరీ నోటుకు కాలదోషం పట్టడానికి ఒక టైమంటూ వుంటుంది. ఆ లోపల త్రిప్పి రాయకపోతే చెల్లదు. కాని పాపం పెళ్ళికా బాధలేదు. దాని కాలదోషం ఆడ దాని జీవితమే. దాని బతుకు తెల్లారితేగాని బాకీ తీరదు. యీ పెళ్ళికి విట్‌నెస్‌లు, సెక్యూరిటీలు - మంత్రాలు, మంగళ సూత్రాలు. సాధారణంగా వ్యాపారంలో పార్టనర్స్ ఏవో కొన్ని రూల్సు పెట్టుకొని అందులో ఏ వొక్కటి, ఎ ఒక్కరు పాటించకపోయినా విడిపోతాం అని రాసుకుంటారు. పెళ్ళికి మేము ఎన్ని బాధలు పడినా కలిసే వుంటామనీ, కుక్కల్లా

క్తంగా శపథం చేసుకుంటారు అంతే కాని మేము కలిపి వుండలేకపోతే విడిపోతాం అన్న మంత్రం ఎక్కడా లేదు మంత్రం లేనంత మాత్రాన విడిపోవడం మానలేదు అందుచేత "డైవోర్సు"లా వచ్చింది అసలు మంత్రాలన్నీ దేవుడు రాస్తే ఆఖరి మంత్రం(Divorce) మనిషి రాసుకున్నాడు అంచేత యిది కూడా మంత్రాల ఆఖర్న చేర్చిస్తే యీ 'లా' పీకి పారేయవచ్చు

నాలాంటివాళ్ళెవరైనా తెగించి 'పెళ్ళి' ఒక వ్యాపారం అంటే నేనేదో హిందూ మతాన్ని నాశనం చేసిన పురుగు నన్నట్టు చూస్తారు ఆడవాళ్ళ పవిత్రతని మంట గలిపేస్తున్నా నంటారు సరే పవిత్రమే నని ఒప్పుకుంటాను మరి అంత పవిత్రంగా చేసుకున్న పెళ్ళి తరవాత చెప్పులు, కొరడాలు ఎందుకలా ఎగురుతూ వుంటాయి? అర్ధరాత్రిపూట ఆ మద్దెళ్ళ చప్పుళ్ళేమిటి?

ఎవరొప్పుకున్నా, ఒప్పుకోకపోయినా పెళ్ళి మామూలు వ్యాపారమే కాదు. గట్టిగా చెప్పాలంటే పరమ దగాకోరు వ్యాపారం మగవాడు సంతకెళ్ళి, తన కొక ధర లేబిల్ అంటించుకొన్నట్టు నటించి తానమ్ముడుపోవటానికి బదులుగా, ఆడదాన్ని డబ్బు, శరీరం, ఆత్మలతో సహా స్వంతం చేసుకుంటున్నాడు అంటే యింకో రకంగా చెప్పాలంటే మగవాడి శరీరం = ఆడదాని శరీరం + ఆత్మ + డబ్బు

ఇలా తయారవుతుంది యీ క్వేషన్

కొనుక్కుంటున్నదన్నమాట

అందరూ ఒప్పుకునే నిజం వెయ్యి అబద్ధాలు ఆడైనా సరే ఒక పెళ్ళి చేయిం చాలి అని మామూలుగా అయితే అబద్ధం చెప్పడం పాపం అంటారు బహుశా పెళ్ళి పవిత్రం అనడంవల్ల ఆ పెళ్ళి చేయించడానికి ఆడే అబద్ధాలకి పాపం అంటుకోదేమో, అబద్ధాలు విరివిగా ఆడొచ్చు అన్న లైసెన్సు ఇచ్చేస్తే అడ్డేవిటింక? పెళ్ళి పేరుతో ఎడాపెడా ఆడేస్తారు "మా అమ్మాయి చదువుకున్నా కూడా వంట అద్భుతంగా చేస్తుంది" (చదువుతో పూర్తిగా చెడిపోలేదన్న మాట) "మా చెల్లెలు కుట్లూ, అల్లికలంటే పడి చస్తుందనుకోండి ఎక్కడైనా ఏదైనా చూస్తే అది కుట్టేవరకు నిద్రపోదు" (ఎలాగూ అప్పుడు కుట్టి మనం కదా అన్న ధీమాతో)

ఈ నాటికీ ఆడపిల్ల పెళ్ళికి క్వాలిఫికేషన్లు వంట, కుట్లూ మాత్రమే—

"మా అబ్బాయికి అమెరికాలో ఆటో మొబైల్ ఇంజనీరింగులో సీటు వచ్చింది ఏదీ పెళ్ళిచేసి పంపించేద్దాం అనుకుంటున్నాం"

(అబ్బాయి చదివింది డిప్లొమా అదైనా ఆనర్సు)

"మా అబ్బాయికి అసలు డబ్బుమీద ఆశ లేదు పిల్ల నచ్చడం ముఖ్యం"

(అడిగిన కట్నం ఇచ్చేస్తే పిల్ల బేషరతుగా నచ్చుతుంది)

ఇందులో వున్న తమాషా ఏమిటంటే ఇద్దరూ నిజం చెప్పడం లేదని ఇద్దరి

త్వరలో జ్యోతి సమర్పిస్తున్నది

# బీ నా దే వి

సీరియల్ నవల

—వివరాలు వచ్చే సంచికలో

తెలుసు ఇందులో సాధారణంగా అమ్మాయి తండ్రిదే పస్తు మార్కు అమ్మాయి తండ్రి అలా కొన్ని కోట్ల అద్దాల్లాంటి అబద్ధాలతో అమ్మాయిపెళ్ళనే పదంతస్తుల మేడకి ప్లాను వేసేస్తాడు అబ్బాయికి యాభై వేలో, లక్షో యిచ్చి ఆ ప్లాను ఔననిపించేస్తాడు పాపం! ఆ తరువాతగాని అతనికి జ్ఞాపకం రాదు యీ పదంతస్తులకీ పునాది లేదని కాని అప్పటికే చేతులు కాలిపోయేయి ఆకులుకూడా లేవు మరంచేత అమ్మాయి జాతకాన్ని ఆ మేడకి రెక్కలుగా కట్టి గాల్లోకి వదిలేస్తాడు. భారం అంతా గ్రహాలదే అన్నట్టు

ఇన్ని బాధలు పడితే ఆ పురోహితుడు తనకొచ్చిన మంత్రాలేవో నాలుగు చదివేసి, అందరూ ఒట్టి పాపాత్ములైనట్టు, కేవలం తన మంత్రాలవల్లే ఆ పెళ్ళి పవిత్రం అయినట్టు, ఆ తంతు జరుగుతున్నంతసేపూ రాజ్యం చేసేస్తాడు

భాష అనేది భావం తెలియడానికి కాని అది అందరికీ అర్థం అయితే దాని విలువ పోతుందనుకున్నారేమో మన పెద్దలు ఎవరికీ అర్థం కాని భాషలో పెట్టేరు మంత్రాలు లేకపోతే నిజంగానే ఎవరికీ అర్థం అవకూడదనే వాళ్ళ ఉద్దేశమేమో అసలింతకీ బాజాల హోరులో, పసిపిల్లల ఏడుపు రొదలో ఆడవాళ్ళ పట్టుచీరల రెపరెపల్లో ఆ మంత్రాలు పురోహితుడితోసహా ఎవరికీ వినిపించవు మధ్య మధ్య "మమ" అనుకోండి అని తప్ప నా కొక్కొక్కసారి అనిపిస్తుంది అతను పెళ్ళికీ, తద్దినానికీ ఒకటే మంత్రం చదువుతున్నాడా అని అలా చదివినా మనం చెయ్యగలిగింది ఏం లేదు పెళ్ళి తంతు అవుతున్నంతసేపూ పురోహితుడిదే రాజ్యం అతను నాలాటివాడై మధ్యలో మంత్రం మరిచిపోతే జ్ఞాపకం వచ్చేవరకు పెళ్ళికూతుర్నో, పెళ్ళికొడుకునో బట్టలు మార్చుకొని రమ్మంటాడు. లేకపోతే అటువాళ్ళ నిటు ఇటువాళ్ళ నటు మార్చి మార్చి కూర్చోపెడతాడు పెళ్ళి పూర్తయేసరికి వాళ్ళిద్దరు గుంజీలు తీసి తీసి అలిసిపోయిన శవాల్లా అయిపోతారు అందుకే మొదటి రాత్రులు ఎప్పుడూ అంత ఫ్రూట్‌ఫుల్ కావు

వీటిన్నిటివల్లే పెళ్ళి పవిత్రం అంటే నేను చెయ్యగలిగిందేమీ లేదు ఇలాంటి పార్పు పెళ్ళి ఆడపిల్లకి అవసరమా? అవసరమైతే అంత ముఖ్యమా?

(పూర్తికాలేదు)

ఇరవై ఏళ్ళు దగ్గరపడుతూన్న మిసెస కైలాసానికి ఇటువంటివి క్రొత్తకాకపోగా ఆమె కోరుకునేవే అవి

అతడి చర్యలకు పరమానందంతో ప్రతిచర్యలను జరుపుతూ చెవిలో అన్నది

---

జరిగిన కథ

శివరావు సౌమ్యుడు, పై మెరుగులకుకాక వ్యక్తిత్వాలకు విలువనిచ్చే వ్యక్తి ఆయన భార్య మీనాక్షి అందుకు పూర్తిగా వ్యతిరేకం వారికున్న ఇద్దరాడపిల్లలలో పెద్దది ఉమ గుణాలకు తల్లి పోలిక తండ్రి గుణాలకు వారసురాలు సుందరి ఆర్థిక చిక్కులలో వున్న గాయక కళాకారుడు సత్యమూర్తికి మీనాక్షి అభ్యంతర పెట్టినా తన పర్సనల్ అసిస్టెంట్‌గా ఉద్యోగం ఇచ్చాడు శివరావు మీనాక్షికి ఇదేమీ నచ్చలేదు శివరావుతో కలిసి సత్యమూర్తి ఇంటికి వెళ్ళినప్పుడు, సత్యమూర్తి తల్లి చూపిన ఆదర భావమూ, ఆ తల్లీకొడుకుల మధ్యగల అనుబంధమూ చూపి ముచ్చటపడిన సుందరి సత్యమూర్తివైపు ఆకర్షితురాలయింది విదేశాలకు వెళ్ళిన కుమార్ తిరిగి రాగానే ఉమ కిచ్చి పెళ్ళిచేయాలని మీనాక్షి సంకల్పం ఉమ జీవితంలోకి శంకర్ ప్రవేశించాడు ఇద్దరూ బ్లూఫిలిమ్స్ చూశారు అంతే! ఉమ తనను తాను మరిచిపోయింది ఉమ గర్భిణి అని తెలవడంతో మీనాక్షి నెత్తిన పిడుగు పడినట్లయింది ఈ దుర్వార్త తెలిపిన శివరావు తట్టుకోలేకపోయాడు శివరావుగారి కుటుంబం అవమానాల పాలుకావడం చూపి తట్టుకోలేని సత్యమూర్తి ఉమను పెళ్ళాడాడు అయినా వారిద్దరూ భార్యాభర్తలుగా ఉండలేకపోతున్నారు ఉమ అత్తగారింటికి వెళ్ళనని భీష్మించింది సుందరి చదువు మానేసేందుకు నిర్ణయించుకొంది తనను ప్రేమించిన సుందరికి అన్యాయం చేశానని కుమిలిపోయాడు సత్యమూర్తి కేవలం తండ్రిపై కృతజ్ఞతతో ఎవరి నేరమో తనపైన వేసుకొని సత్యమూర్తి ఉమను పెళ్ళాడాడన్న నిజం సుందరికి తెలిసి కృంగిపోయింది ఉమ జీవితాన్నొకదారికి తెచ్చే ప్రయత్నంలో సత్యమూర్తి విజయవాడ ఆఫీసు నిర్వహణ పేరుతో ఉమను తీసుకొని బయల్దేరాడు ఉమకు తోడుగా ఉండేందుకు సుందరి కూడా బయలుదేరింది ఉమ అహంభావపు ప్రవర్తన తట్టుకోలేని సత్యమూర్తి తల్లి తీర్థయాత్రలకు వెళ్ళింది శంకర్ కూడా విజయవాడ వచ్చాడు తరచూ ఉమను కలుసుకొంటున్నాడు ఉమకు కొడుకు పుట్టాడు ఉమ బిడ్డ తనకు పుట్టినవాడేనన్న రహస్యం బయటపెడతానని బెదరించి మీనాక్షి, ఉమల దగ్గర డబ్బు రాబట్టేందుకు శంకర్‌ను ప్రోత్సహించింది మిసెస్ కైలాసం

---

"మరోమాట వచ్చేనెల పదిహేనో తారీఖు రాత్రికి నేను విజయవాడ జేరుకుంటాను. నువ్వు నన్నెక్కడ కలవాలో తర్వాత చెప్తాను"

"ఎందుకూ?"

"ఆ సత్యమూర్తిగాడిని అలా వదిలేస్తామా మరి? అన్నిటికీ అడ్డుపడి మన కార్యక్రమాలను తలక్రిందులు చేస్తూన్నవాడే వాడుగా? అంచేత వాడితో ఏదో ఓ కారణంగా కయ్యంపెట్టుకో "

"ఎలాగా?"

"నువ్వుతీసే సినిమాల్లో పాటలు పాడి తీరేట్టు ఒప్పించమని ఉమను ఒత్తిడి చెయ్యి ఆ విధంగా వాడికి ఇంట్లోనూ శాంతివుండదు "

"మంచి అయిడియా!

"ఈ మధ్య నా దగ్గరకు రెండు కంచుదేవతా విగ్రహాలు వచ్చాయి ఒక్కొక్కటీ అయిదడుగుల ఎత్తు విగ్రహం ఎన్నివేల ఏళ్ళనాటివో తెలియనే తెలియదట చాలా గొప్ప శిల్పఖండాలు!"

"వెరీగుడ్ వెరీగుడ్ "

"అవి తీసుకోవటానికి "

"అవి కొనుక్కోవటానికి—అను ఆంటీ "

"అదేలే ఒక ఫారెన్ మ్యూజియమ్ ఉద్యోగి వచ్చే ఏర్పాటుచేసే వచ్చాడు మా అబ్బాయి "

"వెరీగుడ్ "

"అన్ని ప్రాంతాలలోనూ కాపలాలు చాలా దిట్టంగానే వుండటంవల్ల ఈ మధ్య యిటువంటి వ్యాపార విషయాలు చాలా ప్రమాదాలలో పడ్తున్నాయి అందుకని కొండపల్లి అడవులలో అవి అతడికి అందించే ఏర్పాటుచేశాం "

"మంచిదే అయితే నేనేం చేయాలి?"

"చెప్తున్నాగా? ఆ వ్యాపారిని 'సైట్ సీయింగ్'కు తీసుకువచ్చినట్టు తీసుకొస్తాడు మా అబ్బాయి విశ్వం తన కారులో "

"ఊఁ"

"మా కారూ, విగ్రహాలు వున్నకారూ కొంచం కొంచం దూరంగా ప్రయాణం చేస్తూ మరో త్రోవన విజయవాడ జేరుకుని, ఆ అడవుల్లో అర్ధరాత్రివేళ ఆ వ్యాపారిని కల్సుకొని విగ్రహాలు యిచ్చేసి డబ్బు పుచ్చుకుంటాం "

"ఎన్ని లక్షలేమిటి?"

"ఏమో—అదంతా అబ్బాయే నిర్ణయించుకుంటాడు "

"ఆంటీ! నా దగ్గర దాపరికమా?"

"ఒట్టు శంకర్ నాకు తెలియదు "

"పోనీలే మరి ఉమనుంచి నాకు వచ్చిన డబ్బులో నీకు సగభాగం అన్నావ్, ఈ డబ్బులో నాకెంత భాగమిస్తావ్?"

గతుక్కుమన్న మిసెస్ కైలాసం వెంటనే సంభాళించుకుని ప్రసన్నంగా




అన్నది

"ఎక్కడికి పారిపోతాం చెప్పు? తప్పకుండా నాలుగోవాటా యిస్తా, నాకు చిన్న సాయం చేశావంటే "

"ఏమిటది?"

"మనం డబ్బుపుచ్చుకు పారిపోతాం, విగ్రహాలిచ్చి డబ్బు పుచ్చుకొని ఈ లోగానే యుక్తిగా అవతలివాడి కారు ఏదో ఓ కారణంగా వెంటనే నడవకండా పాడు చేసి పెడతాం, రహస్యంగా "

"అచ్చా "

"అదే టైముకు అక్కడికి సత్యమూర్తిగాడిని ఏదో ఉపాయంతో రప్పించే బాధ్యత నీది ఆ వెనుక పోలీసులను పంపించే బాధ్యతమాది "

"ఆఁ!" నోరు వెళ్ళబెట్టాడు శంకర్

"ఆఁ!" గర్వంగా నవ్వింది మిసెస్ కైలాసం

"చూశావా మరి నా తెలివి? సత్యమూర్తిగాడు దేశద్రోహిగా శ్రీకృష్ణజన్మస్థానానికి పోతాడు మన అందరి అడ్డూ తొలగిపోతుంది డబ్బుకు డబ్బూ కురుస్తుంది ఓ పక్క లక్షలు లక్షలు పంజాబీదాన్ని వదిలించేసుకో ఉమను రెండోపెళ్ళి చేసుకో, ఇటు మీనాక్షి ఆస్తి అంతా నీపరమే ఔతుంది!"

ఈలవేస్తూ గిర్రున తిరుగుతూ నాట్యంచేసి తన సంతోషం, అంగీకారం ప్రకటించాడు శంకర్

"ఓకే ఆంటీ! బై!"

హాలులో కూర్చుని పేపర్ చూస్తున్న సత్యమూర్తి తల్లివద్దనుండి వచ్చిన ఉత్తరాన్ని పదే పదే చదువుకుంటున్నాడు. దుఃఖానందాశ్రువులు మిళితమై స్రవిస్తూండగా

"బాబూ, యాత్రలు తిరుగుతూ అన్ని గుళ్ళూ గోపురాలూ చూస్తున్నా నన్న మాటేకాని, ప్రాణమంతా నీ మీదా, నీ చిన్నారి బాబుమీదనే ఉన్నది. నీవు పుట్టక ముందు మీ నాన్నగారూ నేనూ అన్నవరం సత్యనారాయణమూర్తి ఆలయానికి వెళ్ళాం 'మనకు అబ్బాయి పుట్టాలి ఆ చిరంజీవికి ఈ సత్యదేవుని పేరే పెట్టాలి ఆ బాబు సార్థకనాముడు కావాలి ' అన్నారు నాతో ఎప్పుడూ ఇప్పుడు మరీనూ—ఆయనమాటలే ఏ మందిరంలోనికి వెళ్ళినా నా చెవులలో గింగురుమంటున్నాయి నాన్నా 'సత్యం, శివం, సుందరం' అన్నీ నీ పుత్రుడే. అతడున్నచోటే త్రిమూర్తులూ వున్నారు ఇక యిక్కడెక్కడున్నారని యింతదూరం వెతుక్కుంటూ వచ్చావ్?' అని ఎవరో నిత్యం నన్ను నిందీసి ప్రశ్నిస్తూన్నట్లే వున్నది ఇక నిన్ను విడచి వుండలేను నిన్నూ నీ భార్యా బిడ్డలనూ చల్లగా ఆశీర్వదించమనీ, నీ కాపురాన్ని చక్కజేయమనీ కోరుతూ భగవానుని క్షమాపణ వేడుతూ యాత్ర పూర్తిచేయకుండానే వచ్చేస్తున్నాను భగవంతుడు క్షమించుతాడని నమ్మకమున్నది

"కోడలినీ. సుందరినీ అడిగానని చెప్పు

ఆశీర్వాదాలతో,

అమ్మ "

ఉత్తరాన్ని చేతపుచుకొని నిమీలిత నేత్రుడైన సత్యమూర్తి బాహ్య ప్రపంచం వదిలి ఊహాలోకంలోనికి జారిపోయాడు

'అమ్మ అన్ని ఆలయాలలోనూ అర్చనలు చేయించుతోంది అందరూ భగవన్మూర్తుల దర్శనమూ పొంది తరించుతూన్నది తనకొఱకూ, తన కాపురం కొఱకూ ప్రార్థనలు సలుపుతూన్నది కానీ కానీ ఏనాడూ అనృతం పలుకనితాను, ఎవరికీ అన్యాయం చేయని తాను, ఎట్టి ప్రలోభానికీ లోనవ్వని తాను తల్లినే మోసంచేశాడు ఎవరైతే తాను 'సత్యం, శివం, సుందరం'కు మారుపేరని మురిసిపోతోందో ఆమెకే అసత్యం చెప్పాడు 'ఉమ నీకు కోడలు ' అని ఈ సత్యం తెలిసిననాడు అమ్మ తనను క్షమిస్తుందా?

'సుందరే గనుక తన భార్య అయితే అమ్మవెంట సుందరీ తానూ కూడ యాత్రలకు వెళ్ళి ఆమెచే స్వయంగా పూజలు చేయించి ఆమెకు ఆనందం చేకూర్చి వుండేవారు!

'తాను, తనవెంట పూలూ, పళ్ళూ వున్న పళ్ళెరంతో తన భార్యగా—సిగ్గులొలి చిందిస్తూన్న పట్టుచీరలోనున్న అందాల సుందరి! అహా! ఎంత మధురంగా వున్నది ఆ దృశ్యం!




'సత్యం, శివం, సుందరం' అంటూ మనోహరంగా భక్తుల రాగయుక్తమైన గానం వినవస్తోంది ఆ గానంలో మిళితమైన ఆలయ ఘంటారావపు గణగణలు మరింత శ్రవణ మధురిమను ప్రసాదిస్తున్నాయి

'సుందరీ తానూ దైవ విగ్రహాల ఎదుట ప్రాంజలి ఘటించి ఒకరి మనసు నందలి కోరికలను మరొకరి కనులలో చదువుకుంటూ

"ఏమిటా పరవశత్వం??"

కల చెదరిపోయింది

అదరిపడుతూ కనులుతెరచి, బాహ్య ప్రపంచంలోనికి దిగివచ్చాడు సత్యమూర్తి.

తీక్షంగా చూస్తూ, కర్ణ కఠోరంగా ప్రశ్నిస్తూ తన కల చెరిపివేసి ఎదుట నిలబడి వున్న ఆ వ్యక్తి ఉమాదేవి!

సత్యమూర్తి చేతులలోనున్న ఉత్తరాన్ని లాక్కుంటూ నిరసనగా చూచింది

"ఏమిటంత పరవశంలోనికి పంపివేసిన గొప్ప ఉత్తరం? ఎక్కడినుంచేమిటి?"

చదివి అసహ్యకరంగా విసరిపారేసింది

"ఉమా!"

"ఏం? ఏమంత యిది? ఏముందని అందులో?"

"ఏముందో నీ వంటి వాళ్ళకేం తెలుస్తుందిలే?"

"ఔను తెల్సుకునేవాళ్ళు వేరే వున్నారని నాకు తెలుసుగానీ మమ్మీ, డాడీ వచ్చే శనివారం ఇక్కడి కొస్తున్నారు "

"ఎందుకు?"

"ఫోన్ కాల్ వచ్చినప్పుడు నువ్వులేవు మనుమడికి నామకరణం చేయటానికి!"

సత్యమూర్తి.

"ఏం? మీ అమ్మ ఉత్తరానికి అంత పరవశమైపోయినవాడవు, మా మమ్మీ, డాడీ వస్తున్నారంటే అంత నీరసపడిపోయావేం?"

ఇప్పటికీ మాట్లాడలేదు సత్యమూర్తి.

"ఎవరింటికి వారొస్తున్నారు. నీ యింటిగ్గానీ రావడంలేదు. బెంగపడకు."

ఈ శూలంపోటును భరించలేక విలవిలలాడాడు సత్యమూర్తి.

అయినా శాంతంగానే, సరళంగానే జవాబిచ్చాడు. "ఆ విషయం నువ్వు మాటి మాటికీ గుర్తుచేయనవసరంలేదు ఉమా. కానీ.... నువ్వు పదేపదే నిరశిస్తున్నావ్ గనుక చెప్తున్నాను—నీ యింట వుంటున్నానేగానీ మీ డబ్బులో ఒక్కపైసా కూడా నా ఖర్చులకు నేను వాడుకోవడంలేదు. మీ నాన్నగారిచ్చిన ఈ హోదా కేవలం పరుల కంటిచూపు కొఱకు మాత్రమే. నీ యింటి అన్నం ఒక్క మెతుకుకూడా నేను తినలేదు ఈనాటివరకూ."

"ఓహో! మరి ఈ తింటూన్నదంతా, కట్టుకుంటూన్నవన్నీ ఎవరివో ఏమిటో?" నిరసం ధ్వనింపజేస్తూ, వికటంగా పాదం నేలకు తాటించుతూ అతడినే చూస్తూన్నది ఉమ సూటిగా.

ప్రక్క గదిలోనుండి ఈ వాగ్వివాదాన్నంతనూ ఆమూలాగ్రంగా వింటూన్న సుందరి మరి సహించలేనట్లుగా బాణంలా దూసుకు వచ్చింది.

"అక్కా!"

సుందరి నేత్రాలు అగ్నిదేవుని ప్రతిరూపాలవలె వున్నవి.

"నోటికి హద్దూ పద్దూ లేదా అక్కా?"

"నువ్వు నోరుమూసుకు లోపలికి పో. మాటిమాటికీ మా మధ్యన నువ్వెందుకు?"

"నోరుమూసుకొనవలసినది 'నువ్వు' అని చెప్పటానికి వచ్చాను. సత్యమూర్తి గారు ఈ విషపు కూడు తినడంలేదు. 'సత్యం' పేరుతో ఆయన భజన గీతాలూ, భావ గీతాలూ ఒక గ్రామఫోను కంపెనీవారికి పాడి, ఆ రికార్డులమీద వచ్చే డబ్బు తన ఖర్చులకు వాడుకుంటున్నారు. తెలుసా?" తీవ్రంగా, ఛీత్కార స్వరంతో చెప్పింది సుందరి.

అయితే అభిమానం లేని ఆగ్రహ స్వభావిని ఉమకు దెబ్బలాడటానికీ, దెప్పి పొడవటానికీ మరో క్రొత్త విషయం దొరికింది.

"ఓ!" అన్నది చిత్రంగా కళ్ళు తిప్పుతూ, కనుబొమలు విరుస్తూ, "భార్యను నాకే తెలియని వివరాలు—చాలా నీకు తెలుసే?"

"ఆఁ! నువ్వు హేళన చేయాల్సిందేమీలేదు యిందులో. ఆయన జీవితాన్ని నరకం చేయటానికే కానీ, ఆయన బాగోగులూ, కష్టసుఖాలూ విచారించినదెప్పుడు నువ్వు? అదుగో—చూడు—ఆయన పాడిన పాటల రికార్డులన్నీ ఆ అల్మారా




నిండుగా వున్నాయి. లోకానికి తెలిపిన ఆయన విలువ నీకే తెలియనిదానవు—కట్టుకున్నదాననని మాటమాటకూ చెప్పుకోవటానికి సిగ్గుపడాలి!"

ఆవేశంగా అంటూన్న సుందరి చెంప ఛెళ్ళుమంది వెంటనే.

"జాగ్రత్త. హద్దులు తెలిపి మాట్లాడు-నా విషయంలో." అంటూ హుంకరించింది ఉమ.

ఏమి చేయాలో, ఏమి చేయవలెనో తెలియక, నిరుత్తరుడై చూడసాగిన సత్యమూర్తి, ఇప్పటికి మాట్లాడాడు.

"ప్లీజ్ సుందరీ. నన్ను క్షమించు. మాటిమాటికీ నా గురించి నీవు అవమానాల పాలౌతున్నావ్."

సుందరి ఎటూ చూడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

"ఇంతకూ నేను చెప్పవచ్చిన విషయమేమిటంటే—" అధికారంగా ప్రారంభించింది జరిగినదానికి యిసుమంతైనా పశ్చాత్తాపం చెందని ఉమ.

"వాడికి పేరు—'శివరాం' అని నాన్నగారి పేరుపెడితే సంతోషిస్తారు. తన పేరింటివాడని బాగా బహుమానా లిస్తారు. మళ్ళా వాళ్ళొచ్చాక తర్క-వితర్కాలు అనవసరం. అందుకే ఇప్పుడే చెప్తున్నాను."

"నీ బిడ్డ—నీ యిష్టం." నెమ్మది స్వరాన అన్నాడు.

"ఏమోలే—నా యిష్టం లేకుండా వాడిని పెంచుతూన్నట్లే నా యిష్టంలేని—మీ అమ్మ పేరు పెట్టుకుంటావేమోనని—అదేం కుదరదని ముందే చెప్తున్నాను."

"హుఁ." నీరసహాసంతో అన్నాడు సత్యమూర్తి. "దేవతలపేర్లు మానవులకు ఎందుకు పెట్టాలో తెలియనివాడినీ—ఇష్టంలేనివాడినీ నేను."

ఈ మాటల యందలి శ్లేష—గిరగిరా చేతి బ్యాగ్ త్రిప్పుకుంటూ వెళ్ళిపోయిన ఉమ గ్రహించలేదు కానీ, ప్రక్క గదిలోనున్న సుందరికి బాగానే అర్థమైంది

ఉమ నిష్క్రమించిన అనంతరం బయటికి వచ్చి సత్యమూర్తి ఎదుట కూర్చున్నది మరో సోఫాలో

చూడలేక చూడలేక తలెత్తి ఆమె ముఖంలోనికి చూచిన సత్యమూర్తి కనులు బాధగా కదులాడాయి

'సుందరీ!' ఇంకా కందిపోయి ఎర్రగా వున్న ఆమె చెంపను చూస్తూన్న అతడి పెదవులు అదరుతున్నాయి ముఖంలో నిస్పృహాయ లజ్జారుణిమ స్పష్టంగా ద్యోతకమౌతూన్నది

'వాడికి—ఆ పాపపు ముద్దకు నాన్నగారి పేరుపెట్టక తప్పదా' అసహ్యించుకుంటూ అడిగింది సుందరి

"సుందరీ" మరో దెస చూస్తూ సమాధానం యిచ్చాడు సత్యమూర్తి "మనం నిమిత్తమాత్రులం అంతే ఆ విషయంలో మన యిష్టాయిష్టాలు చెల్లవ్ అంతే కాదు—ఉమ చెప్పినట్లుగా అది మీ నాన్నగారికి సంతోషకారణం కూడా"

"ఛీ ఛీ" ముఖం దోసిలిలో దాచుకుని దుఃఖిస్తూ అతడి సమక్షంనుంచి పారిపోయింది సుందరి (సశేషం)

# సగటు తండ్రి

## దేవరకొండ మురళి

శకుంతలకి విసుగొచ్చింది పావుగంట నుంచి వెతుకుతున్నా పద్దు పుస్తకం కనపడటంలేదు ఏ రోజు ఖర్చు ఆ రోజు ఎప్పటికప్పుడు పుస్తకంలో రాసేస్తుంది ఇంట్లో ఎవరు ఏగానీ ఖర్చుపెట్టినా అది ఆమె పుస్తకంలోకి ఎక్కాల్సిందే ఆఖరి ప్రయత్నంగా భర్త గదిలోకి వెళ్ళి టేబుల్ సొరుగు లాగిచూసింది పద్దు పుస్తకం కనపడింది "తగలబడ్డట్టే ఉంది ఈయన జాగర్త" అనుకుని పుస్తకం తీసి న్యూస్ పేపర్ కుర్రాడికిచ్చిన డబ్బు వివరం రాసి పుస్తకాన్ని తిరిగి సొరుగులో ఉంచబోయింది అప్పుడు పొడుగాటి కవరొకటి శకుంతల దృష్టి నాకర్షించింది చేతిలోకి తీసుకుని చూసింది రిజిస్టరు పోస్టులో వచ్చిన కవరది భర్త పేరు మీద ఆఫీస్ అడ్రెస్‌కి వచ్చింది అంటే నిన్ననే వచ్చివుండాలి కవరుమీద పంపిన వారి పేరుకోసం చూసింది ఒక మూల "వై మృత్యుంజయరావు అడ్వొకేట్, మచిలీపట్నం" అని ఉంది మచిలీపట్నం పేరు చూడగానే ఆమె భృకుటి ముడిపడింది ఆలస్యం చెయ్యకుండా కవరులోని కాగితాలని బయటికితీసి చదివింది ఆమెకు ఇంగ్లీషు అంత బాగా రాదు. టైపు చెయ్యబడిన కాగితాలని ఒకటి రెండుసార్లు చదివాక విషయం చూచాయగా బోధపడింది అంతే ఆమె ముఖం ఒక్కసారిగా కళావిహీనం అయిపోయింది నిలుచున్న మనిషి మొదలు నరికిన మానులా నేలకూలింది

ఆమెకి ఫిట్ వచ్చింది

తరువాత కాసేపటికి పిల్లలకి కారియర్లు తీసుకెళ్ళేందుకు వచ్చిన పనికుర్రాడు అమ్మగారిని చూసి అదురుకుని తన వెంట వచ్చిన తన తమ్ముడికి అక్కడే ఉండమని చెప్పి తను బైటికి పరిగెత్తాడు

కారియర్ కుర్రాడు మోసుకొచ్చిన వార్త విని తరణీరావేం తలకిందులవలేదు విని మౌనంగా ఊరుకున్నాడు అయితే ఈ రోజు పిల్లలకి భోజనప్రాప్తి లేదన్నమాటే "చూడు రాంరతన్!" పనికుర్రాడితో అన్నాడు "ఈవేళ కారియర్లు లేవు నువ్వు స్కూలుకి వెళ్ళి బాబుకి హోటలునుంచి ఏదైనా టిఫిన్ తెచ్చి ఇవ్వు" అని జేబులోంచి డబ్బులు

ఆఎ ఇచ్చాడు తర్వాత కాలేజికి వెళ్ళి అమ్మాయిగార్ని మధ్యాహ్నం ప్రాక్టికల్స్ లేకపోతే ఇంటికి వచ్చెయ్యమన్నానని చెప్పు "

"జీ సాబ్!" అని తలవూపి సైకిలు మీద వెళ్ళిపోయాడు రాంరతన్ తరణీ రావు కూడా లేచాడు. భార్యకి ఫిట్ రావటానికి కారణం ఏమైవుంటుందా అని ఆలోచిస్తూ

* * *

కళ్ళు తెరిచి చూసింది శకుంతల ఎదురుగా కుర్చీలో భర్త కనిపించాడు నెమ్మదిగా లేచి మంచంమీద కూర్చుంది తరణీరావు వాచీవంక చూసుకున్నాడు

"టైమెంత అయింది?" అడిగింది నీరసంగా

"రెండుంబావు నువ్వు ముందు హార్లిక్స్ తాగి తర్వాత మాట్లాడు" అన్నాడు ఫ్లాస్కుని చూపించి

కొద్దిసేపు ఎవరూ మాట్లాడలేదు

హార్లిక్స్ తాగుతూ అడిగింది శకుంతల "నోటీసు చదివారా?"

"చదివాను "

ఇంక ఏడుపు ఆగలేదు శకుంతలకి హార్లిక్స్ గొంతు దిగలేదు। గ్లాసు పక్కన పెట్టి ఏడుస్తూనె మాట్లాడసాగింది "అయిపోయింది అంతా అయిపోయింది నేనెంతో కష్టపడి దారికి తెచ్చుకున్న నా సంసారం నడిబజారు కెక్కే రోజు. నేను, నా పిల్లలు చిప్ప చేత్తోపట్టుకుని అడుక్కునే రోజు వచ్చింది అంతా సర్వనాశనం "

"ష్ గొడవచెయ్యకు" విసుగ్గా అన్నాడు తరణిరావు నొటిపివ్వగానే సరిపోయిందా ఏమిటి? నేను వెడుతున్నాను ఇప్పటికే ఆలస్యం అయింది తలుపు వేసుకో "

"ఎక్కడికి వెళ్ళేది?" ఏడుపు మానేసి అరిచింది శకుంతల

"ఆఫీసుకి " అన్నాడు వెళ్ళటానికి ఉద్యుక్తుడవుతూ

"ఆఫీసు లేదు, అధ్వాన్నం లేదు పదండి నిత్యానంద్ ఇంటికి "

ఆగిపోయాడు తరణీరావు అది సుగ్రీవాజ్ఞ తిరస్కరించే శక్తి అతనికి లేదు

* * *

నిత్యానంద్ హైకోర్టు లాయరు తరణీరావుకి టెన్నిస్ మిత్రుడు తనకి ఆట అంత బాగా రాకపోయినా, ఊళ్ళోని "బిగ్‌షాట్స్"ని పరిచయం చేసుకోటానికి తరణీరావు ఉపయోగించే అనేక మార్గాలలో టెన్నిస్ ఒకటి

ఆకస్మికంగా వచ్చిన మిస్టర్ అండ్ మిసెస్‌రావుని చూసి కొంచెం ఆశ్చర్యపోయారు నిత్యానంద్‌లు సాధారణంగా ముందు ఫోన్‌చేసిగాని లేదా తెలియపర్చిగాని ఒకరినొకరు కలుసుకోరు

"రండి రండి సతీసమేతంగా వచ్చారు ఏమిటి విశేషం?" అంటూ ఆహ్వానించాడు నిత్యానంద్ మిసెస్ నిత్యానంద్ కూడా పలకరించింది కాని ముఖం కొంచెం అసహనంగా పెట్టటం పెట్టింది

వాళ్ళు ఎక్కడికో బయలుదేరినట్టు గుర్తుగా కారు పోర్టికోలో నిలిపివుంది

"పనిమీద వెడుతున్నారనుకుంటాను







మీకు శ్రమ ఇస్తున్నట్టున్నాను." అంటూ నసిగాడు తరణీరావు.

"నో, నో. అదేంలేదు. అంత ముఖ్యమైన పనేం కాదులెండి." తేలిగ్గా నవ్వేసి అన్నాడు నిత్యానంద్. "ఇంతకూ ఏమిటి సంగతి? మిసెస్ రావు కూడా వచ్చారు? ఎనీ గుడ్ న్యూస్?"

"గుడ్ న్యూస్ కాదు నా బొంద." తెలుగులో సణుక్కుంది శకుంతల. చిరాకులో ఉన్నప్పుడు ఎదురుగుండా ఎలిజబెత్ రాణి ఉన్నా అల్లాగే విసుక్కుంటుంది.

"మిసెస్‌రావు ఏదో అంటున్నారు." అన్నాడు నిత్యానంద్. అతనికి తెలుగురాదు.

"ఏంలేదు." ఉలికిపాటుని కప్పి పుచ్చుకుంటూ అన్నాడు తరణీరావు. "ఒక విషయంలో మీ సలహా తీసుకుందామని వచ్చాము."

ఇదేదో లీగల్ వ్యవహారమని కనిపెట్టిన మిసెస్ నిత్యానంద్ వాళ్ళవద్ద సెలవు తీసుకుని కారులో వెళ్ళిపోయింది.

"లోపలికివెళ్ళి మాట్లాడుకుందాంరండి" అని ఆఫీసు గదికేసి దారితీశాడు నిత్యానంద్. ఆధునికంగా ఉన్న ఆ యింటి అందచందాలని పరిశీలిస్తూ లోపలికి వెళ్ళింది శకుంతల. ముగ్గురూ వెళ్ళి కూర్చున్నారు. ఆ గదిలో సగాన్ని లైబ్రరీ ఆక్రమించింది.

"వెల్... ఇప్పుడు చెప్పండి." అన్నాడు నిత్యానంద్ సావకాశంగా.

శకుంతల చేటఅంత ఉన్న తన వానిటీ బాగ్‌లోంచి కాగితాలు తీసి నిత్యానంద్‌కిచ్చింది. శకుంతలకేసి సాభిప్రాయంగా చూసి కళ్ళజోడు పెట్టుకుని కాగితాలు మూలాగ్రం చదవసాగాడు.

మచిలీపట్నంనుంచి మృత్యుంజయరావు అనే వకీలు తరణీరావు తండ్రి తరఫున తరణీరావుకి పంపిన రిజిస్టరు నోటీసు అది. అందులో తన క్లయింట్ కొడుకైన తరణీరావు వృద్ధాప్యంలో తన తండ్రిని నిర్లక్ష్యం చేస్తున్నాడని, బతికేందుకు మరేం ఆధారంలేని తన

క్లయింటుని పోషించే బాధ్యత తరణీరావుదే నని, తరణీరావు ఉద్యోగరీత్యా అలహాబాద్‌లో ఉంటున్నందున, వృద్ధాప్యంలో అక్కడికివెళ్ళి కొడుకు దగ్గర ఉండటం తన క్లయింట్ ఆరోగ్యానికి సరిపడదని, అందుచేత తరణీరావు తన సంపాదన లోంచి ప్రతినెలా కొంత డబ్బుపంపే ఏర్పాటు చెయ్యాలనిఉంది. నోటీసుఅందిన పక్షం రోజుల లోపల తరణీరావు దగ్గర్నుంచి ఏ జవాబు రానిపక్షంలో కోర్టు ద్వారా చర్య తీసుకోబడుతుందని ఉంది.

చదవటం పూర్తిచేసి కాగితాలని తరణీరావుకి అందిస్తూ అన్నాడు నిత్యానంద్.

"అయితే మీ తల్లిదండ్రులకి మీ రొక్కరే సంతానమన్నమాట."

శకుంతల కాగితాలని అందుకుని బ్యాగ్‌లో భద్రపరచింది.

అవును. కాని ..." అంటూ ఏదో చెప్పబోతున్న భర్తని ఆపి మధ్యలోనే అందుకుంది శకుంతల. "నిత్యానంద్ జీ, మా మామగారు ఉట్టి దగాకోరు. వ్యసనపరుడు. ఉన్నది ఒక్కగానొక్క కొడుకైనా, తండ్రిగా ఏనాడూ తన బాధ్యతలని నెరవేర్చని మనిషి. మా అత్తగారు చిన్నతనంలోనే పోవటంతో కొడుకుని పోషణకి బంధువుల ఇంట్లో వదిలేసారు.

భూమిమీద ఎన్ని వ్యసనాలున్నాయో అన్నీ ఉన్నాయా పెద్దమనిషికి. పరమ నికృష్టుడు. ఎస్సెల్సీ పాసై వచ్చి మావారు చదువుకుంటానని నోరుతెరిచి అడిగితే, కాదని బట్టలకొట్టు గుమాస్తా ఉద్యోగం చూపించి, చేరమని ప్రాణం తీసి జీవితం నాశనం చెయ్యటానికి పూనుకున్నాడు. ఆ రోజుల్లోనే మా వివాహం జరిగింది. నా ప్రోత్సాహంమీద తండ్రిని కాదని ఆయన బైటికివచ్చి కొంతవరకు మా నాన్న సహాయంతోను, స్కాలర్ షిప్పులతోను కొంత అప్పులుచేసి చదువుకుని స్వయ కృషితో పైకివచ్చారు. మా అదృష్టంకొద్దీ ఆ శనిగ్రహం దాపుల్లోలేకుండా ఇక్కడ అలహాబాద్‌లో ఉద్యోగం అయింది. చదువుకున్న రోజుల్లో ఆయనకి వచ్చిన స్కాలర్‌షిప్పులు, చేసిన అప్పుల తాలూకు పత్రాలు ఇప్పటికీ మా దగ్గిర ఉన్నాయి. ఏదో మా బతుకు మేం బతుకుతూ అప్పులన్నీ తీర్చివేస్తూ వచ్చి ఈ మధ్యనే కాస్త నిలదొక్కుకున్నాము. కొడుకుమీద ఎర్ర ఏగానీ ఖర్చు పెట్టని మనిషి. మా సంపాదనకోసం అర్రులు చాస్తున్నాడంటే, ఆఖరికి కోర్టు కెక్కేవరకు వచ్చాడంటే, ఎంత సిగ్గుశరంలేని మనిషో, ఎంత నీచుడో, ఎంతటి పరమకిరాతక పాతక నికృష్టహీనజన్ముడో మీరే ఊహించండి."

అలహాబాద్ చేరి ఇరవై సంవత్సరాలవుతున్నా తరణీరావుకి హిందీలో మాట్లాడటంరాదు. ఆఫీసులో ఇంగ్లీషుతప్ప మరో భాష వినపడదు. ఇంట్లో తెలుగే మాట్లాడుకుంటారు.

శకుంతల హిందీలో గడగడా చెపుతుంటే నిత్యానంద్ నోరు తెరుచుకుని విన్నాడు. ఆమె మామగార్ని హిందీలో తిట్టిన తిట్లు కొన్ని నిత్యానంద్ కూడా వినలేదు.

తరణీరావు విగ్రహంలా కూర్చున్నాడు.

"మీ తండ్రిగారు ఏం చేస్తుంటారు?"

ఏదో ఆలోచిస్తూ ప్రశ్నించాడు నిత్యానంద్.

"మచిలీపట్నంలో టీచర్‌గా పనిచేసి రిటైర్ అయ్యారు" నోరు విప్పాడు తరణీరావు.

"రిటైరయి ఎన్నాళ్ళయింది?"

"ఎనిమిదేళ్ళవుతుంది." చెప్పాడు.

"మీ నాన్నగారు రిటైరయాక మీరు డబ్బు పంపిస్తూ ఉండేవారా?"

"లేదు."

శకుంతలకీ ప్రశ్నలేవీ రుచించటం లేదు. భర్తనీ, నిత్యానంద్‌నీ మార్చి మార్చి అసహనంగా చూడసాగింది.

"ఆశ్చర్యంగా ఉందే!" అన్నాడు నిత్యానంద్. "ఎనిమిదేళ్ల నుంచి మాట్లాడని మనిషి, ఇప్పుడు నోటీసు ఎందుకు ఇచ్చినట్టు?"

"నిత్యానంద్‌జీ!" ఖంగుమంది శకుంతల కంఠం. "నోటీసు ఎప్పుడు పంపింది ఎలా పంపింది అనవసరం. ముందిది చెప్పండి. కొడుకు భవిష్యత్తుకి ఏమాత్రం సహాయపడని మనిషికి, ఇరవై ఏళ్ళ కిందట మాతో తెగతెంపులు చేసుకున్న వ్యక్తికి మా సంపాదన ఆశించే అర్హత ఎక్కడిది?"

అవును ఎక్కడిది?

కొద్దిసేపు నిశ్శబ్దం రాజ్యమేలింది ఆ గదిలో. గోడగడియారం చేస్తున్న 'టిక్-టిక్' శబ్దం తప్ప మరేమీ వినిపించటం లేదు. తరణీరావు ఏదో ఆలోచిస్తూ బల్ల మీద చూపుడువేలితో 'ఏంటీక్లాక్' దిశలో వృత్తాలు చుడుతున్నాడు.

* * *

నాలుగు దశాబ్దాల క్రిందట ...

"సుందరీ! నేను వచ్చేశాను. కళ్ళు తెరవవూ?" విహ్వలంగా పిలిచాడు రామానందరావు.

బాధతో మెలికలు తిరిగిపోతున్న సుందరి కళ్ళు తెరిచి చూసింది. ఆమె ముఖం చెమటతో తడిసిపోతోంది. తనని చూసి బెంబేలెత్తిపోతున్న భర్తని చూసి అంత బాధలోను నవ్వటానికి ప్రయత్నం చేసింది.

భార్యని హాస్పిటల్‌లో జేర్పించి, బయట కారిడార్‌లో దిగాలుపడి కూర్చున్నాడు రామానందరావు. కాసేపటికి నర్స్ వచ్చి డాక్టర్ పిలుస్తున్నారని చెప్పి వెళ్ళింది. లోపలికి వెళ్ళాడు.

"మీరేనా రామానందరావు?" నిరసనగా చూస్తూ అడిగాడు డాక్టరు.

"అవున"ని ఆందోళనగా తల ఊపాడు. లోపల లేబర్‌రూంలోంచి వినిపిస్తున్న మూలుగు అతని గుండెల్ని ముక్కలుగా తరుగుతోంది.

"మీ భార్యకు ప్రెగ్నెన్సీ రావటం ఎన్నోసారి?" నెమ్మదిగా అడిగినా, అడిగే తీరు కలవరపెట్టింది.

"నాలుగోసారి."

"నాలుగుసార్లూ ఏమైంది?"

"నిలవలేదు. ఎబార్షన్స్ అయ్యాయి" తల వంచుకుని చెప్పాడు.

"నాలుగోసారి ఎబార్షన్ అయినప్పుడు డాక్టర్లేం చెప్పారు?"

రామానందరావు అయోమయంగా చూశాడు. నాలుగోసారి సుందరి స్వగ్రామంలో ఉండగా ఎబార్షన్

అయింది. ప్రతిసారి పుట్టెడు ఆశతో పుట్టింటికి ప్రయాణమై వెళ్ళేది. నాలుగో సారి తనకి శెలవు దొరకకపోవటంచేత వెళ్ళి తీసుకురాలేదు.

ఏం చెప్పారక్కడ డాక్టర్లు?

"నిజం చెప్పండి" కోపంగా అడిగాడు డాక్టరు. "అయిదోసారి ప్రెగ్నెన్సీ వస్తే ప్రాణాలకి ముప్పు అని చెప్పారా లేదా?"

"అబద్ధం!" అని అరిచాడు రామానందరావు. డాక్టరు అంటున్న ప్రతి మాటా అతనికి సమ్మెటదెబ్బలా తగులుతోంది. నెలలునిండినా, ఎబార్షన్ అయ్యే సూచన కనిపించకపోవటంతో ప్రతిసారి పుట్టింటికి ప్రయాణమయ్యే సుందరి ఈసారి ఇక్కడే వుంటానని పట్టుపట్టటం, చివరికి కన్నవాళ్ళకి కబురు చేసేందుకు కూడా వీల్లేదని పట్టుబట్టటం, హాస్పిటల్ జేర్చాక, స్ట్రెచర్ మీద పడుకుని లోపలికి వెళ్ళిపోతున్నప్పుడు చూసిన చూపు, ఒక దాని తరువాత మరొకటి గుర్తుకు వచ్చాయి. కుప్పలా కూలిపోయాడు.

"ఎందుకు మిస్టర్! గొంతు చించుకుని అరుస్తావు?" అసహ్యంగా చూస్తూ అన్నాడు డాక్టరు. "చదువుకున్నవాళ్ళు, అందులో నలుగురికి చదువు సంస్కారం నేర్పే ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న నీలాంటివాళ్ళే ఇలా ప్రవర్తిస్తే, మీ భార్యలు మీతో కాపురం చేసేకంటే రైలు కింద తలపెట్టటం మంచిది. కనీసం ప్రాణం తేలిగ్గా పోతుంది."

లోపల లేబర్ రూంలో ఇంజక్షన్ తీసుకుని నర్స్ చెప్పినట్టు "ఒకటి, రెండు, మూడు" అని లెక్కపెడుతున్న సుందరికి డాక్టరు మాటలు లీలగా వినిపించాయి. ఒక్కసారి డాక్టరుగారికి పిల్చుకురమ్మని నర్స్‌ని బతిమాలింది. అప్పటికి ఆమెకి స్మృతిపోయిందనుకున్న నర్స్ తెల్లముఖంవేసి డాక్టరుని పిల్చింది. డాక్టరు పరుగెత్తుకు వచ్చాడు ఏం కొంప మునిగిందోనని. రామానందరావు కూడా లోపలకి వెళ్ళాడు.

మూసుకుపోతున్న కనురెప్పలని బలంగా ఎత్తి డాక్టరుని చూసి చేతులు జోడించింది సుందరి. "డాక్టరుగారూ, ఇందులో ఆయన తప్పులేదు. ఆయనేమీ అనొద్దు. పిల్లలమీద వెర్రి మమకారంతో నేనే ప్రాణాలకి తెగించాను. డాక్టర్లు ప్రమాదం అనిచెప్పిన విషయం ఆయనకి చెప్పలేదసలు. ఆయనకేం తెలీదు ." పైకెత్తి జోడించిన చేతులు పట్టుజారి క్రిందకి దిగుతున్నాయి.

"నన్ను మోసం చేశావు సుందరీ" కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అన్నాడు రామానందరావు. ఆమె భర్త ఉనికిని గమనించలేదు. డాక్టరు అలాగే నిలబడి చూస్తున్నాడు.

సుందరి చేతులు పూర్తిగా కిందకు దిగి ఎత్తుగా ఉన్న ఆమె కడుపుమీద ఆగి కిందకు జారాయి. తృప్తిగా నవ్విందామె. మాటలు ముద్దగా వస్తున్నాయి. "నేనేమై పోయినా ఫర్వాలేదు. పిల్లవాణ్ణి మాత్రం క్షేమంగా ..." తర్వాత ఆమె కళ్ళు మైకంలో మూతపడ్డాయి. పెదవులింకా కదులుతూనే ఉన్నాయి.

"పిల్లవాణ్ణి ... క్షేమంగా ..."

డాక్టరుకి అర్థమైంది. చివరికి మృత్యువు




కూడా ఆమె కోర్కెకి ఎదురు నిలవలేక పోయింది డాక్టరుగా ఆమె కోర్కె నెరవేర్చగలడు. కాని మనిషిగా తన కర్తవ్యం? తల పంకించాడు రామానంద రావు భుజంమీద అనునయంగా చెయ్యివేసి "పదండి" అన్నాడు

చేతులతో ముఖం కప్పుకుని బైటకి నడిచాడు రామానందరావు

ఊరిలో పేరుమోసిన సర్జన్లని మరి ఇద్దరిని పిలిపించాడు డాక్టరు

ముందు సిజేరియన్ చేసి శిశువుని బైటకి తీశారు

"మీ భార్య కోరుకున్నట్టు మగపిల్ల వాడే!" అన్నది నర్స్ ఆపరేషన్ థియేటర్ లోంచి బయటకి వస్తూ ఆమె చేతుల్లో పొత్తిళ్ళలో పిల్లవాడు ఉన్నాడు

విరక్తిగా నవ్వాడు రామానందరావు కొడుకుకేసి కన్నెత్తి చూడలేదు రామా నందరావుని వింత జంతువుని చూపినట్టు చూపి పిల్లవాణ్ణి తీసికెళ్ళి వేరే గదిలో పడుకోబెట్టి తిరిగి ఆపరేషన్ థియేటర్లోకి వెళ్ళింది నర్స్

తలుపులు మూసుకున్నాయి

మూడుగంటలసేపు మృత్యువుతో పోరాడారు డాక్టర్లు వారి ప్రయత్నం ఫలిచింది సుందరి మరణించలేదు

కాని ఆమెపడ్డ వేదనకి మెదడులో నరాలు దెబ్బతిన్నాయి ఆమెకి మతి భ్రమించింది

సుందరి పిచ్చి సుందరమ్మ అయింది

పిల్లలకోసం తపించిపోయిన సుంద రమ్మ కొడుకుని గుర్తించలేని స్థితిలో పిచ్చితో ఇంటిని నరకప్రాయం చేసింది ఒకనాడు ఆమెని ఉంచే గది తలుపు బైట గడియపెట్టటం మర్చిపోవటంతో అర్ధరాత్రి చడీచప్పుడు చెయ్యకుండా వెళ్ళి నూతిలో దూకింది ఆమె బతుకు అంతటితో ముగి సింది

కొడుకుని బడిలో వేయిద్దామని తీసు కెళ్ళిన రామానందరావుకి అప్పటివరకు

పిల్లవాడికి పేరు పెట్టలేదన్న సంగతి గుర్తుకి వచ్చింది ఒక్క నామకరణమే కాదు భార్య ఉన్ననాళ్ళు ఏ వేడుకా చెయ్య లేకపోయాడు

కొడుకుని బడిలో జేర్పించి స్కూలు రిజిస్టరులో కొడుకుపేరు "తరణీరావు" అని రాయించాడు

* * *

"రిజర్వేషన్ సంగతి ఏంచేశారు?" భర్త స్వెట్టరుకి గుండీలు కుడుతూ అడిగింది శకుంతల

"రిజర్వేషన్‌కింకా టైముంది" తల దువ్వుకుంటూ అన్నాడు తరణీరావు

"అయినా ఈసారి నేనొక్కడినే కదా! రిజర్వేషన్ లేకపోయినా ఎలాగో అలా వెళ్ళిపోగలను" మూడేళ్ళకోసారి డిపార్ట్‌మెంట్ ఇచ్చే పాస్‌మీద తరణీరావు కుటుంబంతో సౌత్‌కి వెళ్ళి నెలరోజులు గడిపి రావటం పరిపాటి అలా వెళ్ళినప్పుడు హైదరాబాద్‌లో ఉండే మామగారింట్లో దిగుతాడు నెలరోజులూ అక్కడే గడిపివేసి తిరిగి వచ్చేస్తారు

"ఏమిటీ? మీరొక్కరూ వెళ్ళటమా! అందులో ఆ ముదనష్టం దగ్గిరకా?" గుండెలమీద చెయ్యి వేసుకుని కళ్ళు పెద్దవి చేస్తూ అంది శకుంతల "నా కంఠంలో ఊపిరుండగా మిమ్మల్ని ఒక్కరినీ పోనివ్వను నేను కూడా మీతోపాటు మచిలీపట్నం వస్తున్నాను"

"ఏమిటి నీ చాదస్తం?" విసుగ్గా అన్నాడు తరణీరావు "ఓ ప్రక్క కేసు కోర్టుకెక్కితే డబ్బుమంచినీళ్ళలా ఖర్చయిపోతుందని గుండెలు బాదుకుంటున్నావు మళ్ళీ నా వెంట నువ్వుకూడా ఎందుకు? డబ్బు దండుగ"

భర్తకి వివరణలు ఇచ్చే అలవాటు లేదు శకుంతలకి గుండీలు కుట్టటం పూర్తిచేసి స్వెట్టరుని భర్తకి అందిస్తూ అంది "రా రతన్‌ని స్టేషన్‌కి పంపి రిజర్వేషన్ సంగతి నేను చూస్తాను మీ పనులు మీరు చూసుకోండి"

స్వెట్టరులో తల దూరుస్తూ అన్నాడు "బాబుకి పరీక్షలవి, నువ్వు లేకపోతే ఇల్లు గడవదని మర్చిపోయావా?"

"ఫర్వాలేదు పెద్దది ఉందిగా! అది ఇల్లు చూసుకుంటుంది వాళ్ళకీ ఇలాంటప్పుడే తెలిసిరావాలి బాధ్యతలు ఎల్లకాలం మనం అంటిపెట్టుకుని ఉండాలంటే కుదరదు"

పిల్లలకి చెప్పవలసిన జాగ్రత్తలు చెప్పి భర్తతో రైలు ఎక్కింది శకుంతల.

* * *

మచిలీపట్నంలో శకుంతల స్నేహితురాలైన అరుంధతి ఇంట్లో దిగారు తరణీరావు దంపతులు ఊళ్ళో దిగాక సరాసరి తండ్రి దగ్గరకే వెడదామని అన్నాడు తరణీరావు శకుంతల ససేమిరా అంది ఎక్కడికెళ్ళాలో, ఎప్పుడు ఏం చెయ్యాలో తనకి బాగా తెలుసునని, సలహాలివ్వద్దని కసిరింది చేసేదిలేక భార్యని అనుసరించాడు

అరుంధతి ఎల్ ఐ సి ఆఫీసులో ఉద్యోగం చేస్తోంది ఆమె భర్త అహోబలరావు ఏదో పెద్ద ఫార్మస్యూటికల్ కంపెనీకి మెడికల్ రిప్రజెంటేటివ్‌గా పని చేస్తున్నాడు నెలకి ఇరవై రోజులు




కాంప్‌మీద తిరుగుతూ ఉంటాడు. అరుంధతి మామగారు వయోవృద్ధుడు. వేళకు అన్నం తిని ఇంట్లో ఒక మూల గదిలో పడకకుర్చీలో కూర్చుని ఏవేవో పుస్తకాలు చదువుతుంటాడు. ఇంటి విషయాలుగాని ఇంట్లో తిరిగే మనుషుల గురించిగాని ఏమాత్రం పట్టించుకోడు.

శకుంతలని, తరణీరావుని సాదరంగా ఆహ్వానించింది అరుంధతి. ఒక గంట సేపు స్నేహితురాలితో కబుర్లు చెప్పి, మధ్యాహ్నం తన భర్త వస్తాడని, తను ఆఫీసవగానే సాయంత్రం వచ్చేస్తానని, అంతవరకు విశ్రాంతి తీసుకోమని చెప్పి ఆఫీసుకి వెళ్ళిపోయింది.

భోజనాలవనిచ్చి భర్తని తమకి నోటీసిచ్చిన లాయరు మృత్యుంజయరావు దగ్గరికి పంపింది శకుంతల. వెళ్ళిన పావు గంటకే ముఖం వేళ్ళాడేసుకుని తిరిగి వచ్చాడు తరణీరావు. "ఆయనసలు నాతో సరిగా మాట్లాడటంలేదు. నే చెప్పింది వినటంలేదు. నేనేం చెప్పినా తిరిగి ఒకటే మాట చెప్తున్నాడు — "ముందు మీ ఫాదర్‌ని కలుసుకుని తరువాతే నా దగ్గరికి రండి." అని.

"అలాగా!" అంటూ మొదలుపెట్టి లాయరుని పది నిముషాలసేపు తిట్లతో తూర్పారపట్టింది శకుంతల. "మన దారిన మనం బతుకుతుంటే చూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్న వెధవలంతా కలిసి ఏదో పెద్ద కుట్రే చేస్తున్నారు. వీళ్ళ అంతు చూసిగాని నేను నిద్రపోను" అని శపథం చేసింది.

తరణీరావు ఆవలించి చిటికెలు వేశాడు. ఎండలో తిరిగిరావటంచేత అతనికి నిద్రతో కళ్ళు మూతలుపడుతున్నాయి.

ఈలోపల భార్యాభర్తల సంభాషణకి

...దల పడకకుర్చీలో కూర్చుని దీక్షగా చదువుకుంటున్న వృద్ధునిలో చలనం కలిగింది. కుర్చీలోంచి నెమ్మదిగా లేచి వచ్చాడు. "అయితే అబ్బాయ్, మీ నాన్న పేరేమిటన్నావ్?"

శకుంతలకి అర్థం కాలేదు. ముసలాయనకేసి అనుమానంగా చూసింది.

"రామానందరావు." చెప్పాడు తరణీరావు.

ఆయన కళ్ళు ఆలోచనతో చిన్నవైనాయి. వృద్ధాప్యంవల్ల శక్తి ఉడిగి ప్రాక్టీసు మానేసినా, ఆయన జ్ఞాపకశక్తి తగ్గలేదు. ఆయన కళ్ళు తిరిగి పెద్దవైనాయి. "అయితే నువ్వు పిచ్చి సుందరమ్మ కొడుకువి కాదూ?"

శకుంతల భర్తకేసి హేళనగా చూసింది—'యీ వూళ్లో మీ కెంత గొప్ప పేరుందో చూశారా' అన్నట్టు.

అరుంధతి మామగారి ప్రశ్నకి అవును, కాదు అన్నట్టు సందిగ్ధంగా తల వూపాడు తరణీరావు.

"చాలా సంతోషం నాయనా! చాలు. ఇంక లేవండి."

"ఎక్కడికి?" ఒకేసారి అన్నారు భార్యాభర్తలు.

"ఎక్కడికో నాకు తెలీదు. మొదట ఈ ఇంట్లోంచి బైటికి."

"ఏమిటి మీ ఉద్దేశం?" కోపంతో బుసలుకొడుతూ అడిగింది శకుంతల.

"ఇంటికొచ్చినవాళ్ళని ఇలా అవమానించటం మీకు అలవాటా? అయినా నేను అరుంధతి స్నేహితురాల్ని. ఈ ఇంటి కోడలు ఆమె మిమ్మల్ని పొమ్మనటానికి మీకేం అధికారం ఉంది?"

శకుంతలకేసి కన్నెత్తి కూడా చూడలేదు అరుంధతి మామగారు. తరణీరావు వంక చూస్తూ అన్నాడు. "చూడు నాయనా! ఆడవాళ్ళతో మాట కలపటం నా కలవాటులేదు. నే చెప్పదల్చుకున్నవి రెండే ముక్కలు. నీకు జన్మనివ్వటానికి ప్రాణాలకి తెగించి, నిన్ను భూమిమీద పడెయ్యటానికి పిచ్చిదైంది మీ అమ్మ. నువ్వు యీ ప్రపంచంలో ఊపిరిపోసుకుని నిలబడటానికి ఆ నాడు, ఆ రోజు డాక్టరుగా నా సర్వశక్తుల్నీ ధారపోశాను. ఈనాడు నేను జీవితంలో చేసిన పొరపాట్లలో అది ఒకటి అనుకుంటున్నాను. ఇకపోతే పుత్రుడైనందుకు పున్నామ నరకంనుంచి తప్పిస్తావని, వైతరణి దాటిస్తావని, నీకు తరణీరావని పేరు పెట్టుకున్నాడు మీ నాన్న. నీ భార్య నీ ముందుంచిన రంగుటద్దంలోంచి చూసి తండ్రికి తోడుగా ఉండటం నరకంగా భావించి, కొడుకుగా నీ బాధ్యతలని కప్పదాటువేసి త్రివేణీసంగమం చేరి సరిగంగ స్నానాలు చేస్తూ మోక్షం సంపాదిస్తున్న సుపుత్రుడివి నువ్వు."

మొఖాల్లో కత్తివాటుకి నెత్తురుచుక్క లేకుండా నిలబడ్డారు తరణీరావు, శకుంతల. అవమానంతో ముఖం నల్లగా కమిలిపోయింది శకుంతలకి. తిరిగి అన్నారు అరుంధతి మామగారు. "మా కోడలు స్నేహితురాలు వస్తోందంటే ఎవరో అనుకున్నానుగాని రామానందరావు కోడ

అనుకోలేదు. పాలు తాగి పెరిగినవాళ్ళ తరానికి చెందినవాళ్ళు మీరు. వెళ్ళండి. మీకీ ఇంట్లో స్థానంలేదు." చేష్టలుడిగి నిలబడ్డారు భార్యాభర్తలు.

"ఇంక కొంచెంసేపట్లో మా అబ్బాయి క్యాంప్‌నించి వస్తాడు. వాడు వచ్చేసరికి మీరు వెళ్ళితే మంచిది. మీ నీడ కూడా వాడిమీద పడటం సహించను నేను." చెప్పవలసింది చెప్పేసి లోపలికి వెళ్ళి యథాప్రకారం పడకకుర్చీలో కూర్చుని ప్రశాంతంగా చదువుకోసాగాడు.

"అయిందా, ఇంకేమైనా మిగిలిందా?" అన్నట్టు భార్యవంక చూశాడు తరణీరావు. ఆ చూపుకి మళ్ళీ మామూలు మనిషైంది శకుంతల. రోషంతో మనసు ఉడికిపో సాగింది. కళ్ళు నిప్పులు కురుస్తుంటే భర్తతో ఏదో చెప్పబోయింది. ఇంతలో బైట హారన్, కారు ఆగిన చప్పుడు అయింది. గేటువంక చూశారు ఇద్దరూ.

గ్లాస్కో పంచెమీద ఖరీదయిన ఖద్దరు సిల్కు లాల్చీ తొడిగి, నాలుగువేళ్ళకి ఉంగరాల్తో, మెడలో పులిగోరు ఉన్న బంగారుగొలుసు వేసుకున్న వ్యక్తి లోపలికి వచ్చి "నమస్కారం! నా పేరు నర్మదరావు. ఊళ్ళో నర్మదాటెక్స్‌టైల్స్ మేనేజింగ్ పార్టనర్‌ని" అని తన్నుతాను పరిచయం చేసుకున్నాడు.

ప్రతినమస్కారంచేస్తూ అన్నాడు తరణీరావు. "కూర్చోండి. అహోబలరావుగారు క్యాంప్ వెళ్ళారు. ఇంట్లోవారి నాన్నగారు వున్నారు పిలవమంటారా?"

నర్మదరావు నవ్వి అన్నాడు. "నేను మీకోసమే వచ్చాను. మీ తండ్రిగారు రామానందంగారు ఇప్పుడు నా దగ్గర వుంటున్నారు."

నర్మదరావుని పరిశీలనగా చూస్తూ అంది శకుంతల. "ఆయనకి మీకు ఏమిటి సంబంధం?"

ఆమెవంక చూసి ముఖం పక్కకి తిప్పుకున్నాడు. "చెపుతాను. ముందు మీరు బయలుదేరండి."

*           *           *

కారుని నెమ్మదిగా పోనిస్తూ చెప్ప సాగాడు నర్మదరావు. "నేనీనాడు ఉన్నత స్థితిలో వున్నానంటే దానికి మాస్టారే కారణం. చదువులో ఎప్పుడూ వెనకబడి వుండేవాణ్ణి. స్కూల్‌ఫైనల్ తప్పి బ్రతుకు తెరువుకోసం చెప్పులరిగేలా తిరుగుతున్న నన్ను తీసుకువెళ్ళి మా స్టారు బట్టల కొట్టులో గుమాస్తాగా చేర్పించారు. దానితో ఊపిరి పీల్చుకున్నాను.

కాలం గడుస్తున్నకొద్దీ వ్యాపారంలో మెలకువలు తెలియసాగాయి. అదృష్టం కూడా కలసివచ్చింది. క్రమంగా వాటాదారు నయ్యాను. ఇదంతా మీ చలవేనని అంటే మాస్టారు ఒప్పుకోరు. పైగా నవ్వుతూ"ఈ ఉద్యోగం చూపించినందుకే నా వాళ్ళకి నేను శత్రువునయాను నర్మదరావ్!" అంటూ వుంటారు అప్పుడప్పుడూ.

తరణీరావు, శకుంతల ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. శకుంతల హిందీలో సణుక్కుంది. "సందేహం లేదు. పీడిక్కూడా కుట్రలో భాగం వుంది...."

తరణీరావు యథాప్రకారంగా నాలి

కారు ఇంద్రభవనంలా వున్న ఇంటి ముందు ఆగింది. గూర్ఖా సలాంచేసి గేటు తెరిచాడు. కారు వెళ్ళి పోర్టికోలో నిలిచింది.

"లోపలకు రండి" కారు దిగి ఆహ్వానించాడు నర్మదరావు. తరణీరావు శకుంతల కారు దిగి లోపలికి వెళ్లారు.

నర్మదరావుతోపాటు ఆ గదిలో అడుగు పెట్టాడు తరణీరావు. మామగారి మీద ప్రయోగించబోయే తిట్ల పదజాలాన్ని మననం చేసుకుంటూ భర్తని అనుసరించింది శకుంతల.

మంచంమీద కళ్ళు మూసుకుని పడుకుని వున్న తండ్రిని చూసి దిగ్భ్రాంతి చెందాడు తరణీరావు. అంతవరకు అతనికి ఆరడుగుల పొడవులో, పచ్చని దేహచ్ఛాయతో, ఖద్దరు బట్టలలో భుజంమీద జరీ కండువాతో సింహంలా వుండే తన తండ్రి రామానందరావు మాత్రమే తెలుసు. కాని ఇప్పుడు అతను చూస్తున్న వ్యక్తి వేరు. మాసిన పంచె బొడ్డుకిందకు జారి పక్కటెముకలు పొడుచుకువచ్చి కనిపిస్తున్నాయి. ఊపిరి విడుస్తుంటే డొక్క ఎగిరిపడుతోంది. శరీరం కుష్కించి నల్ల కప్పు వేసుకుపోయింది. నుదుటిమీద ఎముకలు కూడా కనిపిస్తున్నాయి నీళ్ళులేని గోతుల్లో పారేసిన గవ్వల్లా గుంటలలో కళ్ళు మూతలు పడి వున్నాయి.

శకుంతల చిత్తరువై చూడసాగింది. తన ఆజన్మ శత్రువుని ఆ స్థితిలో చూసే సరికి ఆమెకి నోటమాట రాలేదు. తన మామగారు ఆ మనిషేనంటె నమ్మ శక్యంగా లేదు. ఆమె మనసులో ఒకే ఒక ప్రశ్న తేనెటీగలా రొదపెట్టసాగింది.

కాటికి కాళ్ళు చాపిన మనిషి కోర్టు నోటీసు ఎందుకిచ్చినట్టు?

నర్మదరావు మంచం దగ్గరికి వెళ్ళి ముందుకు వంగి చెవిలో చెప్పాడు "మాస్టారూ! తరణీ వచ్చాడు. నేను చెప్పినట్టే వచ్చాడు. చూడండి."

సరైన కాంబినేషన్ పెట్టి కీ తిప్పగా తాళం తెరుచుకున్నట్టు తెరుచుకున్నాయి రామానందరావు కళ్ళు. పగటిపూట వెలిగే ఎలక్ట్రిక్ బల్బులా కాంతిహీనంగా ఉన్న ఆ కళ్ళు మొదట శకుంతలని చూశాయి.

భర్త చెయ్యి గట్టిగా పట్టుకుంది శకుంతల. ఆమెకి ఎందుకో వణుకు పుట్టింది.

రామానందరావు దృష్టి కొడుకుమీద పడింది. కళ్ల క్రమంగా కాంతిని పుంజుకున్నాయి. తరణీరావు అలాగే నిశ్చలంగా చూస్తున్నాడు. నర్మదరావుకూడా మాస్టారి కేసి రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు.

రామానందరావు చూపుల్లో దైన్యం లేదు. పశ్చాత్తాపంలేదు. పుత్ర ప్రేమ లేదు. ప్రాణభీతి లవలేశమైనా లేదు.

తన క్లాసులో మార్కుల్లో ఎప్పుడూ వెనకబడి వుండే కుర్రాడు ఒక్కసారిగా క్లాసంతటికీ మొదటివాడుగా వస్తే ఆ ఉపాధ్యాయునిలో కలిగే భావం ఆయన చూపుల్లో వ్యక్తమైంది. ఆయన ఏదో చెపుతున్నట్టు నోరు కదిలించసాగాడు.

తరణీరావు అయోమయంగా నర్మదరావుకేసి చూశాడు.




మాట పడిపోయి మూడు రోజులైంది అన్నాడు నర్మదరావు తిరిగి మంచంకేసి వంగుతూ రామానందరావు ఏవో శబ్దాలు చెయ్యసాగాడు

శకుంతలకి నిలబడలేక పడిపోతానేమో ననిపించింది మానసికంగా ఆమె చాలా బలహీనురాలు మృత్యుముఖంలో వున్న మనిషిని అంత దగ్గిరగా చూడటం ఆమెకి అదే మొదటిసారి

నర్మదరావు అంటున్నాడు మీరు నిశ్చింతగా వుండండి మాస్టారూ! అంతా మీరు చెప్పినట్టే జరుగుతుంది ఈ మాటలని అతను శకుంతలకేసి చూశాడు

రామానందరావు కళ్లుమూసుకున్నాడు ఆయన ముఖంలో ఇప్పుడు ప్రశాంతత గోచరిస్తోంది

నిద్రపోతున్నారు ఒక అరగంటలో మెలకువ వచ్చేస్తుంది మళ్ళీ వద్దాం అప్పుడు అన్నాడు నర్మదరావు గదిలోంచి బైటికి దారితీస్తూ ముగ్గురూ వెళ్ళి హాలులో సోఫాలమీద కూర్చున్నారు కాసేపు ఎవరూ మాట్లాడలేదు మొదట నర్మదరావే ప్రారంభించాడు

మీరు మాస్టారితో ఏం మాట్లాడినా వద్దని చెప్పే హక్కు నాకు లేదని తెలుసు అయినా నేనో షరతు పెడుతున్నాను మీరందుకంగీకరిస్తేనే మాట్లాడనిస్తాను మాస్టారిప్పుడు నా సంరక్షణలో వున్నారు కనుక ఇలా చెప్పాల్సిన అవసరం వచ్చింది "

శకుంతల ఏం మాట్లాడలేదు శారీరకంగానూ మానసికంగాను అలసిపోయిందామె వచ్చినదగ్గర్నుంచి ప్రతి విషయంలోను తను అనుకున్నదానికి పూర్తి విరుద్ధంగా జరుగుతోంది జరుగుతున్నవాటిని కళ్ళప్పగించి చూడటం తప్ప తనేం

చెయ్యలేదిప్పుడు.

తరణీరావు అన్నాడు. "అలాగే మీ షరతేమిటో చెప్పండి."

నర్మదరావు చెప్పాడు. "మీరు లాయరు నోటీసు సంగతి ఆయనదగ్గర ఎత్తకూడదు."

ఎందుకని అడగలేదు తరణీరావు. అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తున్నాడు.

తిరిగి నర్మదరావేఅన్నాడు నెమ్మదిగా: "లాయరుచేత మీకు మాస్టారి తరఫున నోటీసు ఇప్పించింది నేను. ఆయనకు తెలీదసలు."

శకుంతల మస్తిష్కం కదిపిన తేనె తుట్టిలా అయింది.

"నేనిది ఊహించాను" అన్నాడు తరణీరావు నెమ్మదిగా. శకుంతల భర్త కేసి చూసింది.

నర్మదరావు చెప్పుకుపోతున్నాడు. "మాస్టారు ఆరోగ్యం పాడయ్యాక మీకు చాలా ఉత్తరాలు రాశారు. అవి మీదాకా వచ్చాయో, లేదో, ఏమయ్యాయో ఊహించగలను నేను. ఆయన మీకురాసిన చివరి ఉత్తరం నా దగ్గరే ఉంది. పోస్టు చెయ్యమని నా కిచ్చారు. అది రాసాకే గుండెలో తీవ్రంగా నెప్పివచ్చి పడి పోయారు." అతని కంఠం రుద్ధమయింది. కళ్లు తుడుచుకుని చెప్పసాగాడు. "వంటి మీద స్పృహ ఉన్నంతవరకు ఎవరి సహాయాన్ని కోరని అభిమానపరుడు. ఆఖరికి నా సహాయాన్ని కూడా నవ్వుతూ నిరాకరించేవారు. ఈ స్థితిలో ఆయన్ని ఇంటికి తీసుకురా గలిగాను. ఆయన పోస్టుచెయ్యమని ఇచ్చిన ఉత్తరం నా దగ్గరే ఉండి పోయింది. ఆలోచించాను. ఈ ఉత్తరం మీరు చేరవచ్చులేదా మిగిలిన ఉత్తరాలకి పట్టినగతే దీనికీ పట్టవచ్చు. ఒకవేళ ఉత్తరం మీ చేతుల్లోపడినా మీరు బయలుదేరి రావటానికి ఎంత అవకాశం ఉందో రాక పోవటానిక్కూడా అంతే అవకాశంఉంది. ఏమైనా, మాస్టారి విషయంలో రిస్కు తీసుకోటానికి నాకు ఇష్టంలేకపోయింది. అందుకే, ఉత్తరం బదులు మీకు లాయర్ నోటీసు అందేటట్టు చేశాను. మిమ్మల్ని ఇక్కడికి రప్పించటానికి ఇంతకంటే మార్గం తోచలేదు నాకు. తను రాసిన ఉత్తరం చూసుకునే మీరు వచ్చారను కుంటున్నారు మాస్టారు. ఆయనకా సంతృప్తిని చివరివరకు మిగిలిపోనివ్వండి"

"ఉత్తరాలు ..ఉత్తరాలు" అంటూ గొణుక్కున్నాడు తరణీరావు. భార్యకేసి నిశ్చలంగా చూశాడు.

జీవితంలో మొదటిసారి భర్తచూసిన చూపుకి నిలువెల్లా వణికింది శకుంతల.

ఆమె తల భూమిలోకి కుంచించుకు పోయింది.

జేబులోంచి ఒక కవరు తీసి ఇచ్చాడు నర్మదరావు. "ఇదిగో ఆ వుత్తరం. దీన్ని మీకు అందజేయటం కూడా నా బాధ్యత లలో ఒకటి."

తరణీరావుకి కవరు లోపల ఉత్తరం కాక మరేదో ఉన్నట్టుగా అనిపించింది.

కవరు తెరిచి లోపల చెయ్యిపెట్టి బైటికి తీశాడు.

బాగా నలిగిపోయి, మాసిపోయివున్న నోట్లు అవి. ఒకటి రెండు చిరిగేందుకు సిద్ధంగా ఉన్నాయి.

వణికే చేతులతో మడతని కవరు లోంచి పైకితీసి ఉద్వేగాన్ని అణుచు

కుంటూ ఉత్తరాన్ని చదివాడు.

"చిరంజీవి తరణీరావుకి,

నువ్వూ, కోడలు, పిల్లలు క్షేమమని తలుస్తాను. నా ఆరోగ్యం క్షీణించాక నీకు దాదాపు పది ఉత్తరాలైనా రాసివుంటాను. అవి నీకు అంది ఉంటాయన్న ఆశ అడుగంటింది. అయినా ఇప్పుడు ఈ ఉత్తరం రాస్తున్నాను.

చూడు తరణీ, నాకు కోడలంటే కోపం లేదు. సానుభూతి తప్ప. ఆమె మనిషన్నవాడిని చస్తే నమ్మదు. మంచిని ఎక్కడా చూడలేదు. అవే తెలివితేటలని నువ్వు భావిస్తూ ఉంటావు. మంచిదేగాని ఆ రకం మనుషులు వాళ్ళు సుఖపడరు. తోటివారిని మనశ్శాంతిగా బతకనివ్వరు.

నేనేదో నీ మీద ప్రేమ చంపుకోలేక, రక్తపాశాన్ని తెంచుకోలేక, లేదాకొడుకుగా నీ బాధ్యతలని నీకు గుర్తుచెయ్యటానికి ఈ వుత్తరం రాస్తున్నాననుకోకు. అది పొరపాటు. తండ్రిగా నన్ను నువ్వేంత అపేక్షిస్తున్నావో. కొడుకుగా నిన్ను నేనంతే అపేక్షిస్తున్నాను. ఒకప్పుడు నాలోనూ ప్రేమానురాగాలుండేవికాని మీ అమ్మ వాటిని తనతోపాటు తీసుకెళ్ళిపోయింది. మొదటినుంచి కావాలనే నిన్ను నాకు దూరం చేసుకుంటూ వచ్చాను. ఇరవై ఏళ్ళక్రితం కోడలు, నాతో ఘర్షణపడి, 'జన్మలో నా ముఖం చూడనని, నిన్ను చూడనివ్వనని శపథంచేసి వెళ్ళినప్పుడు నాలో నేను నవ్వుకున్నాను. ఇప్పటికీ నవ్వుకుంటాను. బ్రతికినంత కాలం ఎవరి సహాయం ఆశించలేదు నేను. ఆశించను కూడా. కాని ఇంకెంతకాలమో నేను బతకనని తెలిశాక నాలో ఒక కోరిక నాకు తెలియకుండానే బీజం నాటుకుని వేళ్ళుతన్ని మహావృక్షమై కూర్చుంది. నా జీవితంలో ఎన్నో సెంటిమెంట్స్ని తోసి రాజన్నాను. అలాగే మనసు మళ్ళించుకుందామని విశ్వప్రయత్నం చేశాను. సాధ్యంకాలేదు. ఈ దేశంలో పుట్టటమే అందుకు కారణమేమో.

నాలాగే కాలం చెల్లిన నా మిత్రులు కొందరు నాతో అంటూ ఉండేవారు. "నీకేమోయ్, నీ కొడుకు అలహాబాద్లో ఉన్నాడు. ఒకవేళ సమయానికి రాకపోయినా, నీ ఉత్తరక్రియలు గంగాతీరంలోనో, త్రివేణి సంగమంలోనో చేసేస్తాడు నీకు జన్మరాహిత్యం కలుగుతుంది. అదృష్టవంతుడివంటే నువ్వే." అని. వాళ్ళ మాటల్లో నేను మరణించినా నువ్విక్కడికి రావు అన్న శ్లేష కూడా ఉండేది.

తరణీ, వాళ్ళన్నట్టు, నువ్వు నేను పోయాక ఏ గంగాతీరంలోనో లేక త్రివేణీ సంగమంలోనో నాకు ఉత్తరక్రియలు జరిపితే జరపవచ్చు. నేను కావాలనుకుంటే నర్మదరావు నా శరీరాన్ని చందనపు కట్టెలతో దహనం చేస్తాడు. కాని నా కవి రెండూ సంతృప్తినివ్వవు. నేను మరణించాక ఉత్తరక్రియలు ఇక్కడే నా కొడుకు చేతిమీదనే జరగాలి. నా శరీరం ఇక్కడే నా పూర్వీకులు కలిసిపోయిన చోటే మట్టిలో కలిసిపోవాలి. తండ్రిగా నిన్ను నేను కోరే, మొదటికోరిక, ఆఖరి కోరిక కూడా ఇదే.

ఇట్లు, నీ తండ్రి రామానందరావు.

షరా:— నేను మరణించాక కర్మకాండకి అయ్యే ఖర్చు నిమిత్తం కావలసిన డబ్బుని నర్మదరావు దగ్గర జాగ్రత్తచేసి ఉంచాను. అడిగితీసుకో, ఆ ఖర్చు తన పద్దు పుస్తకంలోకి ఎక్కదని కోడలికి చెప్పు.

***




గోపాలం, గాయత్రీ ప్రేమించుకున్నారు.

సాయంత్రం ఆరుగంటల వేళ. పబ్లిక్ గార్డెన్స్‌లో, విశాలమైన గరిక పచ్చ మైదానంలో, క్రోటన్ చెట్ల చాటున, ఏకాంతంగా ప్రేమసౌధాలు నిర్మించుకుంటున్నారు.

"ఈ రోజు నువ్వు బాగున్నావు."

"అంటే?"

"అంటే మొన్నటికన్నా నిన్న, నిన్నటి కన్నా ఈరోజు బావున్నావని." అది ఆమెను పొగడటం అని అతడి ఉద్దేశం. అతడికి అమ్మాయిమీద యిష్టమైతే వుంది గాని, ఎలా చెప్పాలో తెలియదు. చాలా మంది అతని స్థాయి మనుషుల్లాగే అతడు తెలివిగలవాడేమీ కాదు. ఏదో కాలేజీ, ఉద్యోగం, వారపత్రికలు చదవటం, సినిమాలు చూడటం, త్వరగా నిద్రపోవటం, అప్పుడప్పుడూ సిగరెట్లు కాల్చటం.... తప్ప ప్రత్యేకంగా ప్రేమ సంభాషణ అంటూ అతడికేమీ తెలియదు.

అందువల్ల వాళ్ళ ప్రేమ సంభాషణ చప్పగానే వుంది. అది జనం తిరిగే చోటు కావటంవల్ల వాళ్ళ చేష్టలు సభ్యతను ఒక్క రవ్వకూడా దాటిపోలేదు. కాకపోతే కూర్చున్నప్పుడు వెనక్కూ, పక్కకూ కాస్త పరచుకున్న ఆమె చీర కొంగును ప్రేమికుడు ముట్టుకుని చాలా ఆనందం అనుభవించాడు.

"నాకైతే మా అమ్మ తప్ప యింకెవరూ లెరు ఆమె ఒప్పుకుంటుందనే నమ్మకంకూడా నాకుంది నీ కభ్యంతరం లేకపోతే మీ పేరెంట్స్‌ను ఎప్పుడు అడగమంటావు? అన్నాడు గోపాలం

గాయత్రి తల వంచుకుంది

ఇదే అదనుగా గోపాలం, ఆమె భుజం తట్టి, "గాయత్రీ, మాట్లాడవేం? ఏమిటి?" అన్నాడు.

"లాభం లేదు గోపాలం. మా అక్కయ్య పెళ్ళైనదాకా నా గురించి నేనేమీ చెప్పలేను."

"సరే. వెయిట్ చేద్దాం. కాని గాయత్రీ, మీ అక్కయ్య ఇన్నాళ్ళు, పెళ్ళిగాకుండా ఎలా వుంది?"

మళ్ళీ గాయత్రి మౌనం వహించటంతో, గోపాలం, ఆమెపట్ల తనకు గల ప్రేమను గురించి పునర్వ్యాఖ్యానం చేస్తూ.

"ఎన్నేళ్ళు ఆగాల్సి వచ్చినా సరే, నేను నిన్నే చేసుకుంటాను గాయత్రీ. నువ్వు నమ్మకపోవచ్చు గాని, యిది నిజం. నిన్ను చేసుకోలేని పక్షంలో నేను ఆజన్మ బ్రహ్మచారిగానే వుండిపోతాను" అన్నాడు.

ఈసారి గాయత్రి, మోకాళ్ళమీద చేతులూ, చేతుల్లో తలా పెట్టుకుని గోపాలంవైపు చూపింది. ఆమె స్పష్టంగా నవ్వలేదు గాని, ఆమె కళ్ళు సంతోషంగా వున్నట్టుగా అతడి క్కనిపించింది.

"నువ్వు మాట్లాడవేం, గాయత్రీ!" అన్నాడు గోపాలం.

"మీ కున్నంత స్వాతంత్ర్యం మాకు లేదుగా. నేనేమీ వాగ్దానాలు చేయలేను. కాని నేను బ్రతికుంటే నీ భార్యగానే, వరికోసానికూడా అలా అనకు" అంది గాయత్రి

ఇప్పుడు ఆమె మాటల్లో బాధమాత్రమే గాక, ఆమె కనుకొలకులలో నీరుకూడా కనిపించింది గోపాలానికి కాని తన ప్రేమను వ్యక్తపరచటానికి యింకా సన్నిహితమైన చేష్టలేవీ చెయ్యకూడదనే నియమం వుండటంవల్లా, ఆ చేష్టలకు సమానమైన మాటలు తెలియకపోవటం వల్లా అతడు మౌనంగా వున్నాడు.

"నా స్వార్థంకోసం నిన్ను నిరీక్షించమని చెప్పే అధికారం నాకేమున్నది?" అంది గాయత్రి.

వెంటనే గోపాలం,

"ఈ విషయంలో నీకెంత స్వార్థమున్నదో, నాకూ అంతే స్వార్థమున్నది" అని రెడీమేడ్ సమాధానం చెప్పేశాడు.

ఇలా చక్కగా అతికినట్టుగా డైలాగులు చెప్పటం గోపాలానికి చాలా యిష్టం. కాని, చాలాసార్లు అతడు ఈ ప్రయత్నంలో విఫలమవుతుంటాడు.

"చూడు గాయత్రీ, మన ఈ ఆర్నెళ్ల పరిచయంలో నా గురించి నీకు కొద్దో గొప్పో తెలిసే వుంటుంది. నువ్వు నన్ను పెళ్ళి చేసుకోవటానికి వొప్పుకున్నావంటే నా గురించి నీకు కొంత మంచి అభిప్రాయం వుండటంవల్లనే. అలాగే నేను నిన్ను ఒదులుకోదలచటం లేదంటే నీ మీద నాకు ఆరాధనాభావం వుండటం వల్లనే. అటువంటప్పుడు మనం యింక ఎన్నాళ్ళు నిరీక్షిస్తామన్నది ముఖ్యం కాదు. ఆర్నెల్లు - లేదా ఆరేళ్ళు - ఎన్నేళ్లైనా




సరే నీకోసం నిరీక్షిస్తాను గాయత్రీ. నీకోసం ఏమైనా, ఏ త్యాగమైనా చేస్తాను" అన్నాడు గోపాలం.

ఈలోగా పల్లీలవాడొచ్చాడు. గోపాలం చేత్తోనే వాణ్ణి వెళ్ళిపొమ్మని సైగచేశాడు. గాయత్రి కళ్ళు కిందికి వాల్చుకుని నిశ్శబ్దంగా వింది.

సూర్యు డస్తమించాడు. వెలుగు తగ్గింది. జనం లేచి వెళ్ళిపోతున్నారు.

గోపాలం యిప్పుడు కొత్త సాన్నిహిత్యం అనుభవించాడు. గాయత్రి భుజం మీద చెయ్యివేసి,

"లేద్దామా" అన్నాడు.

"ఊఁ" అంది గాయత్రి.

"కామత్‌లో కాఫీ తాగేసి నెమ్మదిగా వెళ్దాం" అన్నాడు.

"త్వరగా వెళ్ళాలి" అంది గాయత్రి.

అతడి వేళ్ళు ఆమె వేళ్ళతో కలిసి మాట్లాడేయి. ఆమె లేచి చీర సవరించుకుని, కొంగు భుజంమీద సరిచేసుకుని చెప్పులు తొడుక్కునేసరికి, 'పద' అంటో అతడి వేళ్ళు ఆమె నడుమును పలకరించాయి.

"అబ్బ, కాళ్ళు నడవనియ్యటం లేద కూర్చుంటే తిమ్మిరెక్కినట్టున్నాయి అన్నది గాయత్రి కుంటుతూ.

"సైన్ ఆఫ్ వీక్‌నెస్. కాసేపు నడి అదే పోతుంది, పద" అన్నాడు.

పబ్లిక్ గార్డెన్స్ గేట్ దాటి రోడ్డుమీ కొచ్చారు. ఆమె యింకా కుంటుతూ వుంది.

"అటువైపు వెళ్దామా" అంటో రోడ్డు క్రాస్ చెయ్యటానికి నడిచాడు గోపాలం గాయత్రి అతణ్ణనుసరించింది.

ఆకాశంనుండి ఊడిపడ్డట్టుగా ఆర్టీ బస్సొకటి వాళ్ళవైపు దూసుకుంటూ వచ్చింది.

"గాయత్రీ రా" అంటో ఒక్క అంగలో రోడ్డు కటువైపు గెంతాడు గోపాలం.

భయంతో గాయత్రి ఒక్కడుగుకూడా కదల్లేక పోయింది.

అనుభవజ్ఞుడైన డ్రైవరు సడెన్‌బ్రేకు వేసి ఆమె ప్రాణం కాపాడాడు. ★

# బేరం

"త్వరగా బయలుదేరు. ఇప్పటికే చాల ఆలస్యమయింది" తొందరపెట్టాడు చందూ. మే మిద్దరం చెకుముకిరావు సన్మాన సభకి వెళ్ళాలి. రోడ్డెక్కాం.

"అవసరం వచ్చినప్పుడు కాళీ రిక్షా ఒక్కటికూడ కనబడి చావదు కదా!" విసుక్కున్నాను నేను. నవ్వాడు చందూ. దూరంగా రిక్షా ఒకటి వస్తూంది. కాళీ రిక్షాయే. ఆపాం. వెళ్ళాల్సిన చోటు చెప్పి "ఎంత ఇవ్వమంటావ్?" అన్నాడు చందూ.

"రూపాయివ్వండి."

"ఎనభై పైసలు ఇస్తాం."

"గిట్టుబాటు కాదండీ."

పొమ్మన్నాం. వాడు పోయాడు. వెళ్ళిపోయాడు.

"అసలు నన్నడిగితే ఎనభై పైసలు కూడ ఎక్కువే" గొణిగాడు చందూ.

ఇంకో రిక్షావాడిని ఆపాం.

"రూపాయి పావలా ఇవ్వండి."

పురుగును చూసినట్లు చూసాను వాడిని. 'కాశీగా పోవడానికైనా సిద్ధమే కాని, వాడెక్కిన చెట్టుమాత్రం దిగడానికి సుతరామూ ఒప్పుకోడు. ఈ రిక్షావాళ్ళంతా ఇంతే' అన్నాడు చందూ పోతున్నవాడ్ని చూస్తూ.

"మనమిక్కడే వుంటాం. అక్కడ సన్మాన సభ కాస్తా అయిపోతుంది. చెకుముకిరావు మనల్ని జన్మలో క్షమించడు" అన్నాను.

మరో రిక్షారావు మావైపే వచ్చాడు. మళ్ళీ పాతపాటే. రూపాయి పావలా అడిగాడు.

'రూపాయి ఇస్తాం' తప్పలేదు. త్వరగా వెళ్ళాలన్న తొందరలో అనేసాను. "లేదండీ! చాలదూరం వెళ్ళాలి" రిక్షారావు బిగిసిపోయాడు.

"వెళ్ళిరా నాయనా" సాగనంపాడు చందూ.

"నీకసలు బుద్ధిలేదు. రూపాయిస్తానంటావేమిటి? వీడు కాకపోతే మరొకడు– వీళ్ళకన్నా మొదటివాడే నయమనిపించాడు. అదిగో! మరో బాబాయి వస్తున్నాడు" అన్నాడు చందూ.

బాబాయిని ఆపాం. వెళ్ళాల్సిన చోటు చెప్పాం.

"ఎనభై పైసలు ఇప్పించండి."

"అరవై పైసలు ఇస్తాం" చటుక్కున అన్నాను.

—విజయ్

ప్రతాప రవిశంకర్



కాంతారావు నిజమైన బ్రహ్మచారి. చాలా మంది బ్రహ్మచారుల్లా పైకి కబుర్లు చెబుతూ, చెడుతిరుగుళ్ళు తిరిగే అలవాటు అతనికి లేదు. అతను కొత్తగా ఆ ఊరు వచ్చాడు. అతను ఆ ఉద్యోగంలో ప్రవేశించి నిండా రెండు నెలలు కాలేదు. కొత్త ఊరు, కొత్త ఉద్యోగం ఎట్లా వుంటుందో అని భయపడుతూనే ఆ ఊరు వచ్చాడు. కాని, అతనలా భయపడకుండానే అతను ఉద్యోగంలో చేరిన పదిరోజులకే అతని కొలీగ్ రామ్మూర్తి అతనికి మంచి మిత్రుడై కాంతారావు హోటల్లో వుండలేక పోతున్నాడని గ్రహించి రెండురోజుల లీవుమీద అతికష్టంతో ఆఫీసుకు కొంచెం దూరంలో వున్న ఓ పేటలో చిన్న గదిని అద్దెకు చూపించాడు. ఆ రాత్రికే తన మకాంని హోటలు నించి గదికి మార్చేశాడు కాంతారావు.

కాంతారావు ఆ గదిలో ప్రవేశించిన వారంరోజుల తర్వాత ఓ సంఘటన జరిగింది. ఏమిటంటే అతను తొమ్మిది గంటలకల్లా స్నానం ముగించి డ్రెస్ చేసుకుని గదికి తాళంపెట్టి బయటకు వెళ్ళబోతుండగా ఓ అమ్మాయి అతని దగ్గరకువచ్చింది. ఇరవై యేళ్ళ లోపు వయస్సు. ఎర్రని శరీరచ్ఛాయ, కొంచెం లావుగా పొడుగ్గా వుంది. నుదుట చిన్న ఎర్ర తిలకం బొట్టు, విశాలంగా వున్న కళ్ళు చెవులకు పెద్ద పెద్ద రింగులు వేళ్ళాడు





ంన్నాయి రెండు జడలు వేసుకొని ఓ
ిడలో ఎర్రమందార పువ్వును తురుము
ుంది. ఆ అమ్మాయి గబగబా నడిచి
ావడంవల్లనేమో ఆ పువ్వు పడిపోవ
ానికి సిద్ధంగా వుంది.

ఆ అమ్మాయి రాకలోని ఆంతర్యం
అతనికి అంతుబట్టలేదు. 'ఎవరీ అమ్మాయి?
ఎందుకొచ్చింది?' ఇలాంటి ప్రశ్నలు
అతని మెదడులో తలెత్తాయి.

కొన్నిక్షణాల నిశ్శబ్దం తరువాత ఆ
అమ్మాయే అన్నది, "నా పేరు సరస్వతి.
ఈ వీధిలో మూడో యింట్లో వుంటు
న్నాము. ఇంటర్ పాసైనాను. మిమ్మల్ని
కలుసుకోవాలని వచ్చాను" అన్నది
కొంచెం తడబాటుతో.

"నన్ను కలుసుకోవాలని వచ్చారా?"
కళ్ళను కొంచెం పెద్దవిచేస్తూ అడిగాడు.

"అవును, మీరు రచయితని నిన్ననే
పోస్టుమేన్ద్వారా తెలిసింది. అతను
మిమ్మల్ని రోడ్డుమీద కలుసుకుని పత్రికను
మీకు యివ్వటం చూశాను. అతనికి మీరు
రచయితనని, పదిరోజుల్లో ఎమ్వో
రావచ్చుననీ చెప్పారుట. పోస్టుమేన్ని
అడిగితే చెప్పాడు. మీ కథ చదివాను.
చాలా బాగుంది. మిమ్మల్ని కలుసుకుని
మాట్లాడా లనిపించింది. వచ్చాను" అన్నది
సరస్వతి సిగ్గుపడుతున్నట్టుగా ముఖంపెట్టి.

"చాలా థాంక్స్. నేనిప్పుడు హోట
లుకి వెళ్ళి భోజనంచేసి ఆఫీసుకి వెళ్ళ
బోతున్నాను. రేపు ఆదివారం కదా....
రండి .... తీరిగ్గా మాట్లాడుకోవచ్చు"
అన్నాడు కాంతారావు.

సరేనన్నట్లు తల ఊపింది సరస్వతి.

ఇద్దరూ గేటుదాటి బయటకు వచ్చారు
చెరోవైపుకి వెళ్ళిపోయేరు.

అనుకున్నట్టుగానే ఆ మరురోజు
ఉదయం తొమ్మిది గంటలకు సరస్వతి,
కాంతారావు గదికి వచ్చింది మరింత
అందంగా ముస్తాబయి.

"కూర్చోండి" అంటూ తనకు రెండడు
గుల దూరంగావున్న కుర్చీని చూపాడు.
బిడియపడుతూనే కూర్చుంది.

"మీకు కథలు చదివే అలవాటు బాగా
వుందా?" తనే సంభాషణను మొదలు
పెట్టాడు కాంతారావు.

అవునన్నట్లు తలాడించి తను ప్రతి
పత్రికనూ విడవకుండా చదువుతాననీ,
కొంతమంది రచయితల పేర్లు, తనకి బాగా
గుర్తున్నాయనీ, ఏ రచయిత కథలు
ఎక్కువగా ఏ పత్రికలో పడతాయోకూడా
చెప్పింది సరస్వతి. ఆశ్చర్యంతో నోరు
తెరవకుండా వుండలేకపోయాడు కాంతా
రావు. 'ఈ అమ్మాయికి కథలంటే ఇంత
ఇంట్రస్టు వుందా!' అనుకున్నాడు. ఇంకా
తను ఏయే నవలలు చదివిందీ, తనకు ఏ
నవల బాగా నచ్చిందీ చెప్పింది సరస్వతి.
ఆ తర్వాత కాంతారావు కథలు రాసే విధా
నాన్ని గురించి అడిగింది. 'మీరు పగలు
రాస్తారా? రాత్రిళ్ళు రాస్తారా? జరిగిన
సంఘటనల గురించి రాస్తారా? లేక
ఊహించి రాస్తారా? ట్రాజెడీలు ఇష్టమా?
కామెడీలు ఇష్టమా? నా మటుకు నేను
ప్రేమకథలు చదవటమంటే హాయిగా
ఫీలవుతానండీ. మీరు ఎక్కువగా అలాంటి
కథలే రాయండి రావుగారూ" అన్నది
చివరగా.

కాంతారావు నవ్వి ఊరుకున్నాడు.

మం౦ా పావుగంట కూర్చుని పదన్నొర కల్లా ఇంటికి వెళ్ళిపోయింది సరస్వతి. అతను హోటలుకు వెళ్ళిపోయేడు.

ఆరోజునించి వీలున్నప్పుడల్లా కాంతారావు గదికి వస్తూండేది సరస్వతి. ఇద్దరూ ఏవో కబుర్లు చెప్పుకునేవారు. కాంతారావు దగ్గర చాలా ఫ్రీగా వుండటం నేర్చుకుంది ఆ అమ్మాయి చాలా తక్కువ వ్యవధిలో.

సరస్వతి గురించి, ఆమె కుటుంబం గురించి కాంతారావుకి తెలిసిన విషయాలివి :

ఆ అమ్మాయి తండ్రి స్కూలు మాస్టరుగా చేసి రిటైరు అయినాడు. ఆయనకు అంతగా ఆస్తిపాస్తులేవీ లేవు. నలుగురు ఆడపిల్లలు. ఇద్దరు మగపిల్లలు. మగపిల్లలు సరస్వతికంటే చిన్నవాళ్ళు. స్వగ్రామంలో ఓ ఎకరం మెట్టపొలమూ, ఇప్పుడు వుంటున్న చిన్నయిల్లు తప్పించి మరేమీ లేవు. ఇంటిమీద అద్దె రాదు. పొలంమీద వచ్చే ఆదాయం, ఆయనకొచ్చే పెన్షనూ, ఆయన రెండో కూతురు కుట్టు మిషనుమీద సంపాదించే డబ్బు ఆ కుటుంబానికి ఆధారమని తెలిసింది.

ఓరోజు సరస్వతి చెప్పింది .. తను ప్రైవేటుగా బియ్యే చదువుతున్నాననీ, అందుకు కావలసిన సహాయం తన తండ్రి చెయ్యకపోయినా తన అక్కయ్య చేస్తానని పుస్తకాలు కొనిపెట్టిందనీ, చెప్పింది. ఇంకా తనంటే అక్కయ్యకి ఎంతో ప్రేమని, చిన్నతనంనించీ తనని ఎంతో శ్రద్ధగా చూసేదనికూడా చెప్పింది. ఆ అమ్మాయి మాటలద్వారా సరస్వతికి తన రెండో అక్కయ్యంటే మంచి ప్రేమ, గౌరవం వున్నాయని తెలిసింది.

తరచు తన గదికి వచ్చిపోతున్న సరస్వతిమీద కాంతారావుకి యిష్టం కలిగింది. ఒకరకంగా ఆమెను బాగా ప్రేమించాడు. కాని, తన ప్రేమను సరస్వతి ముందు ఏనాడూ వ్యక్తపరచలేదు. కాని, సరస్వతి ప్రవర్తన నిండుకుండలా వుండేది. ఆమె మాటల్లో ఎలాంటి తడబాటు అతనికి కనిపించలేదు. మంచి స్నేహితుడితో మాట్లాడినట్లు అతనితో మాట్లాడేది.

ఓ ఆదివారం సాయంత్రం అతను గదిలో కూర్చుని ఏదో కథ రాస్తుంటే వచ్చింది సరస్వతి. మామూలుగానే పలకరించి మాట్లాడింది. కొన్ని నిముషాల తర్వాత "ఇప్పుడు మిమ్మల్నొక మాట అడుగుదామని వచ్చాను" అన్నది.

"ఏమిటి?" కుతూహలంగా అడిగాడు అతను. ఒకవేళ తనని ప్రేమిస్తున్నానని చెబుతుందేమో అనుకున్నాడు.

"నాకు పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. ఇంట్లో చదువుకోటానికి డిస్టర్బెన్స్‌గా వుంది. అసలు సాగటంలేదు. మీరు ఆఫీసుకి వెళ్ళిన తర్వాత మీ గది ఖాళీయే గదా? మీరు వచ్చేవరకూ ఇక్కడ చదువుకుంటాను. మీకేమైనా అభ్యంతరమా?" అని అడిగింది.

కాంతారావు కొంత ఆశాభంగం పొందినా అందుకు అంగీకరించాడు.

"ఓ. కె. అలాగే దానిదేముంది?" అన్నాడు.

ఆ మరురోజునించీ కాంతారావు ఆఫీసుకు వెళ్ళే సమయానికి పుస్తకాలు తీసుకొని అతని గదికి వచ్చేది సరస్వతి. తిరిగి అతను వచ్చేవరకూ వుండి రాగానే




యింటికి వెళ్ళిపోయేది.

ఇలా ఓ పదిహేనురోజులు గడిచేయి. ఈ పదిహేను రోజుల్లో కాంతారావుకి సరస్వతిమీద వున్న ప్రేమ రెండింత లయిండి. ఆ అమ్మాయిని గురించి గంటల తరబడి ఆలోచించటం మొదలు పెట్టాడు. ఆఫీసులో కూడా పరధ్యానంగా వుంటున్నాడు. రెండు మూడుసార్లు ఆఫీసరుచేత చివాట్లు తిని సారీ కూడా చెప్పుకున్నాడు.

ఓరోజు కాంతారావు ఆఫీసుకి బయల్దేరుతుండగా పోస్ట్‌మేన్ ఓ కవర్ని అతని చేతిలో వుంచి వెళ్ళిపోయేడు. అది అతని తండ్రి రాసిన ఉత్తరం. 'ఉద్యోగంలో చేరావు కదా.....ఇంకెన్నాళ్లు బ్రహ్మచారిగా వుంటావు? ఇక్కడ మీ అమ్మ, బామ్మ నిన్నొక యింటివాడిని చెయ్యాలని తహతహలాడుతున్నారు. చాలా సంబంధాలొస్తున్నాయి. నువ్వు సరేనంటే ఏదో సంబంధాన్ని ఖాయం చేసుకుందాం. ఏమైనా ఈ శ్రావణ మాసంలో నీ పెళ్ళి జరిగేటట్టు చూడమంటున్నారు. ఆపైన నీ యిష్టం' అని రాశాడు తండ్రి. ఆ ఉత్తరం కాంతారావుని మరింత తీవ్రంగా ఆలోచించేటట్టు చేసింది.

తన పెళ్ళికోసం ఇంట్లో పెద్దలు తొందరపడుతున్నారు. తనకీ తొందరగానే వున్నది. ఎవర్ని చేసుకోవాలన్నది సమస్యకాదు. తన మనసులో సరస్వతి రూపం కదులుతూనే వుంది. తనకిగాని, తండ్రికిగాని కట్నం ఆశ లేనేలేదు. బహుశ సరస్వతిని చేసుకోటానికి తల్లీ తండ్రీ అందరూ ఒప్పుకోవచ్చు. సరస్వతికీ తనని చేసుకోటం ఇష్టమే కావచ్చు. వాళ్ళ కుటుంబ పరిస్థితులు తనకి తెలుసు. వాళ్ళింట్లో సరస్వతి తన భార్య

…లా సాగిన అతని ఆలోచనలు కాంతారావుకి ఎంతో సంతోషాన్ని కలిగించాయి. అతని మనసు నిలవలేదు. ఆఫీసులో కూర్చో బుద్ధికాలేదు. ఈ విషయం సరస్వతికి చెప్పాలి. 'సరస్వతీ! నిన్ను పెళ్ళి చేసుకోబోతున్నాను. నువ్వు నా భార్యవి. నువ్వే నా భార్యవి....' అని పరుగుమీద వెళ్ళి చెప్పాలి. ఒక్కసారి ఆమెను తనదగ్గరికి తీసుకోవాలి.

ఆఫీసర్ పర్మిషన్ తీసుకొని బయటకు వచ్చాడు. ఖాళీగా పోతున్న రిక్షాను ఆపి ఎక్కి కూర్చున్నాడు. 'త్వరగా పోనీ' అన్నాడు. రిక్షా తన గదిముందు ఆగే వరకూ ఏవో కలలుగన్నాడు. కాంతారావు హీరో....సరస్వతి హీరోయిన్ ...నిజానికి ఆఫీసునించి గదికి రావటానికి పది నిముషాలే పట్టినా అతనికి రెండుగంటలయినట్లనిపించింది.

రిక్షావాడికి రూపాయినోటు యిచ్చి చిల్లర తీసుకోకుండానే గదిదగ్గరకు నడిచాడు తలుపులు వేసివున్నాయి సరస్వతి నిద్రపోతుందనుకున్న ఆలోచన వచ్చి నవ్వుకున్నాడు దబదబా తలుపులమీద బాదాడు

"సరస్వతీ....సరస్వతీ ..

తలుపులు తెరుచుకోలేదు.

ఇక ఆగలేకపోయాడు. పక్కనేవున్న కిటికీ తలుపును గట్టిగా నెట్టాడు. లోపల గొళ్ళెం వేసిలేదేమో భళ్ళున తెరుచుకుంది తలుపు. తెరుచుకున్న కిటికీ రెక్కతోపాటు వెలుతురు విసురుగా లోపల ప్రవేశించింది. ఆ వెలుతురులో అతనికి కనిపించిన దృశ్యం....

ఎవరో అతను-కాంతారావుకి తెలీదు. తన లుంగీ వంటికి చుట్టుకుంటున్నాడు. ఆమె శరీరానికి చీరెను కట్టబెట్టుకుంటోంది. కళ్ళను మరింత విశాలంచేసి ఆశ్చర్యంగా చూశాడు. సరస్వతేమో అనుకున్నాడు. కాని కాదు. ఆమె అక్క. ఎనిమిదేళ్ళ క్రితం మొగుడు వదిలేసిన కుట్టుమిషనుమీద డబ్బు సంపాదిస్తూ కుటుంబాన్ని ఆదుకుంటూ చెల్లెల్ని చదివించుకుంటున్న అహల్య. **





# ఉప్పు సముద్రం

వారాల కృష్ణమూర్తి

'....నర్మద చాల తెలివైన అమ్మాయి కాలేజీ మొత్తానికి తానొక్కతే ఫస్ట్ క్లాస్‌లో పాసయింది ఇంటర్. మెడిసన్ ఎన్‌ట్రన్స్‌కు ప్రిపేర్ కమ్మని చెప్పాలి! ...' అని అనుకుంటుండగా....

"నమస్కారం మాస్టారూ!" అంటూ వచ్చింది నర్మద గదిలోనికి.

"నమస్కారం!ఏమ్మా బాగున్నావా!!" ఆప్యాయంగాఅడిగాడు ప్రిన్సిపాల్ రాఘవరావ్. బాగున్నానంటూ తలాడించింది నర్మద.

"నీవు మెడిసన్ ఎన్‌ట్రన్స్‌కు ప్రిపేర్ కావాలమ్మా,నీకుతప్పకుండ సీటువస్తుంది. బాగా చదివి పెద్ద డాక్టర్‌వి కావాలి. .." నర్మద వైపు చూశాడు. తను చెబుతుంది శ్రద్ధగా వింటుంది నర్మద. కాసేపయాక ". ఇంతకూ నీకు చదవాలనుందా! మీ నాన్నగారు ఏమంటున్నారు!" అంటూ అనుమానంగా చూశాడు నర్మద వైపు.

"మా నాన్న. చదువుతానంటే వద్దనడు. నాకూ చదవాలనే వుంది. మెడిసన్‌లో చేరితే బావుంటుంది. మరి సీటు వస్తుందో రాదో."

"సీటు గురించి ఆలోచించక బాగా చదువు ఎగ్జామ్ బాగా రాశావంటే సీటు తనంతతానే వస్తుంది నిన్ను వెతుక్కుంటూ!"

"అలాగే మాస్టారూ! మరి నేను శలవు తీసుకుంటాను." అంటూ చేతులు జోడించింది. రాఘవరావ్ "మంచిదమ్మా!" అన్నాడు.

నర్మదకష్టపడి చదివింది ఎన్‌ట్రన్స్‌కు. ఎగ్జామ్ అవగానే 'హమ్మయ్యా! ఎన్‌ట్రన్స్ టెస్ట్ అంటే ఇంతేనా! ఈమాత్రం దానికి హడలిపోయాను.' అనుకుంటూ తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. తనకు తప్పక యం. బి. బి. యస్. లో సీటు వస్తుందని మరే కాలేజీలోనూ చేరలేదు నర్మద.

నర్మద అనుకున్నట్టుగానే ఎన్‌ట్రన్స్ టెస్ట్‌లో పాసయింది, ఇంటర్వ్యూకెళ్ళింది. ఇంటర్వ్యూలోనూ పాసయి ఫీజు కట్టి కాలేజీలో చేరింది.

నర్మద యం. బి. బి. యస్.లో చేరిందని తెలిసి తానే చేరినట్టు సంతోషించాడు రాఘవరావ్. తన స్టూడెంట్ డాక్టర్ అవబోతుంది...అని అనుకున్నప్పుడు ఎంతో

ఫ్రస్త్రీగా వుండేది. బాగా శ్రద్ధగా చదవ మని ఓ ఉత్తరం వ్రాసి పోస్ట్ చేశాడు.

* * *

"నమస్కారం మాస్టారూ! ...."

ఎవరా వచ్చిందని తలెత్తి అనుకో కుండా వచ్చిన నర్మదను చూసి ఆశ్చర్య పోయాడు రాఘవరావ్.

"ఏమిటి మాస్టారూ! అలా చూస్తు న్నారు!!"

"ఏమీ లేదు! కూర్చోమ్మా!!" కుర్చీ చూపాడు. నర్మద రాఘవరావ్‌కు ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది. "కులాసాగా వున్నావా! చదువెలా సాగుతుంది. పెళ్ళి రెండు నెలలన్నా కాలేదు అప్పుడే వచ్చావ్. ఇంటిమీద బెంగా! ...ఇలా అయితే చదువు పాడవదూ ...అందునా డాక్టర్ కోర్సాయె. డాక్టర్‌కోర్స్ అంటే మాటలా!...." అంటూ అభిమానంతో చివాట్లు వేశాడు రాఘవరావ్.

నర్మద ఏమీ మాట్లాడకుండా తన హాండ్‌బాగ్ తెరిచి ఓ వెడ్డింగ్‌కార్డ్ తీసి రాఘవరావ్ చేతికి అందించింది. ఎవరి దబ్బా అనుకుంటూ చూశాడు రాఘవ రావ్. అందులో....సాగర్....నర్మద.... అన్న పేర్లు చూసి తెల్లబోయి నర్మద వైపు చూశాడు.

"ఏంచైను మాస్టారూ! నాకైతే చదవాలనే వుంది. కానీ మా నాన్న మళ్ళీ ఇలాంటి సంబంధం రాదంటున్నాడు. అమ్మకూడ బలవంతం చేస్తుంది. ఆశల్ని చంపుకుని పరిస్థితులతో రాజీపడడంకన్నా ఆడది ఏం చైగలుగుతుంది " అంటూ తన అశక్తతను వెల్లడిచేసింది నర్మద

"పెళ్ళయ్యాక చదవచ్చుగా!"

"లాభంలేదు మాస్టారు! వాళ్ళ కిష్టం లేదట!!"

"ఇంతకూ అబ్బాయి ఏం చదివాడు?"

"చదువు అంతగా లేదు. బోలెడు ఆస్తి వుంది. వ్యవసాయం చూసుకుంటూ వుంటారు .. "

"మంచిదమ్మా!" నిట్టూర్చాడు రాఘవ రావ్.

"మరి నే వస్తాను మాస్టారూ! మీరు పెళ్ళికి తప్పకుండ రావాలి!!" అంది నర్మద లేస్తూ. రాఘవరావ్ 'వస్తా'నన్నట్టు తల వూపాడు. నర్మద "నమస్తే!" అంటూ శలవు తీసుకుంది.

చాలాసేపువరకు నర్మద వెళ్ళినవైపే చూస్తూ కూర్చున్నాడు ప్రిన్సిపాల్ రాఘవరావ్. నర్మద తెలివైంది. ఆమె విజ్ఞానానికి పెళ్ళి అడ్డుగోడగా నిలుస్తుంది.

ఈ దేశంలో ఎన్నో జీవనదు లున్నాయి. అయినా మనకు నీటి కొరత వుంది. కారణం ఆ జీవజలాల్ని మనం ఉపయోగించుకోలేక వృధాగా ఉప్పు సముద్రంలోనికి వదిలేస్తున్నాం! అలాగే స్త్రీల తెలివితేటల్ని విజ్ఞానాన్ని పూర్తిగా వినియోగించుకోలేక పెళ్ళి అనే తంతుతో వాళ్ళని సంసార సాగరంలో వదిలే స్తున్నాం!....అనిపించింది రాఘవరావ్‌కు



# అబద్ధాలు

మా రెండోపాపకి ఆరేళ్ళు.

అది ఆశువుగా అబద్ధాలు చెబుతుంది. అవసరమనీ లేదు. అనవసరమనీ లేదు. అబద్ధాలు చెప్పటమే తన జీవిత ధ్యేయం లాగ నోరు విప్పితే చాలు అబద్ధాలు. ఆ అలవాటు ఎలా మాన్పించాలో అర్థం కావటంలేదు.

పిల్లిలాగ మెల్లగా వచ్చింది అది.

"ఏమ్మా! ఏం కావాలి?"

"నాన్నా ... మరేమొచ్చి ... మా స్కూల్లో లలిత వుంది కదా....అదే మొచ్చి ...నన్ను పోలీస్‌స్టేషన్లో పెట్టిం చెస్తానంది ..."

చచ్చేను!

ఈ కంప్లెయింట్ సీరియస్‌గా తీసు కొని టీచర్‌కి రిపోర్టు యివ్వలేను. అలా గని నిర్లక్ష్యం చేసి మానెయ్యలేను.

ఇంతకు మునుపు ఒకసారి యిలాగే అబద్ధపు కంప్లెయింట్ చేసి నన్ను అభాసుపాలు చేసింది.

"నిజమే?"

"నిజం నాన్నా .. సరస్వతొట్టోడు...."

"ఛప్ ...నోర్ముయ్...." లేని కోపం నటిస్తూ కళ్ళు పెద్దవి చేశాను.

అది భయంతో వణికింది.

"నిజమేనా?...." గర్జించాను.

"ఉహూఁ .." భయం భయంగా తల అడ్డంగా తిప్పింది.

వెంటనే స్వరం మార్చేశాను.

"తప్పు తల్లీ....అలా అబద్ధాలు చెప్ప కూడదు. అబద్ధాలు చెపితే....మరేమో ... వచ్చే జన్మలో బొద్దింకలై పుడతారు."

దాని కళ్ళు భయం భయంగా చూశాయి.

బొద్దింకలంటే దానికి చెప్పలేనంత భయం.

"ఇంకెప్పుడూ యిలా అబద్ధాలు చెప్పవుగా?" అనునయంగా అడిగాను.

"చెప్పను" అంటూ తల వూపింది.

"రైట్....యింక వెళ్ళి ఆడుకో...."

"అలాగే ...." అన్నట్టు తల వూపింది. కాని వెళ్ళకుండా అక్కడే నిలుచుని "నాన్నా...." పిలిచింది సందే హంగా.

"ఏమ్మా?"

"మరేమొచ్చి ...వచ్చే జన్మలో.... నువ్వేమొచ్చి ... బొద్దింకగా పుడ తావా? .."

షాక్ తిన్నాను!

"ఎందువలాగ?"

"మరేమో....నిన్న, అల్ల వాళ్ళెవరో వస్తే ..మనిల్లు ఎవరికీ అద్దె కివ్వ లేదన్నావేం? బాచీ వాళ్ళమ్మా నాన్నా అద్దెకే వుంటున్నారుగా....మరి అబద్ధం చెప్పావా నాన్నా?...."

వాళ్ళు, అంటే నిన్న సాయంత్రం వచ్చిన వాళ్ళు, హౌస్ టాక్సు అసెస్ మెంటుకి వచ్చారు.

పాపకి నేనేం జవాబు చెప్పను?

—శ్రీవాణి

# పోనీ నేను వ్రాసిపెట్టనా?

డా॥ సి. ఆనందారామం

"మేడమ్!" అంటూ నేను సాధారణంగా చదువుకొంటూ కూచునే కెమిస్ట్రీ స్టోర్ రూంలోకి వచ్చింది లలిత. చదువుతోన్న పుస్తకం మూసి "ఏం కావాలి?" అన్నాను.

లలిత కొద్దిగా సంకోచపడుతూ "మీరు కథలు ఎలా రాస్తారు మేడమ్?" అంది.

ఈ ప్రశ్న రచయిత్రిగా నేను చాలా సార్లు వినవలసివస్తుంది. ఎప్పుడు చెప్పే సమాధానమే చెప్పాను. "జీవితంలోంచి ప్రేరణ పొందీ."

లలిత తెల్లబోయి చూసింది. "అంటే?" అంది.

"మనం కళ్ళు విప్పి చూడాలేకాని, మన చుట్టూ కథలే!"

"ఏదీ నాకొక కథ చూపించండి!"

నా మాటల్ని అంత లిటరల్‌గా తీసుకున్న ఆ అమాయకత్వం చూస్తే జాలి వేసింది. ఇలాంటి మేధా సంపత్తితో కథలు వ్రాయటానికి ఎలా సిద్ధపడుతుందోనని ఆశ్చర్యం కూడా కలిగింది.

"ప్లీజ్! చూపించరూ?" ప్రాధేయపడుతున్నట్లు అడిగింది. లలిత ఉబలాటం చూస్తే జాలేసింది. ఆ అమ్మాయి నిజంగా ఎంతవరకు వ్రాయగలదో చూడాలనిపించింది.

"నా స్నేహితురాలు మాలతికి ఈమధ్య ఆరోగ్యం సరిగాలేదు. నిన్ననే గీత నర్సింగ్ హోంలో జాయిన్ చేసారు ఇవాళ సాయంత్రం చూడటానికి వెళ్తున్నాను. నువ్వూరా! అక్కడేం జరుగతుందో చూడు. ఆ తరువాత ఏం వ్రాస్తావ్ వ్రాయి" అన్నాను.

ఆ సాయంత్రం లలిత నాతో గీత నర్సింగ్‌హోంకి వచ్చింది. మేము వెళ్ళేసరికి మాలతి ఒక నడివయసు యువతితో మాట్లాడుతోంది. మాట్లాడుతోనే మమ్మల్ని కూచోమని సైగచేసింది. మేము అక్కడున్న కుర్చీలలో కూచున్నాము.

"పరవాలేదు పెద్దమ్మా! ఎందుకో లోజ్వరం వస్తోంది. అదే తగ్గిపోతుందిలే!"

"అలా అనకమ్మాయ్! ఈ మాట విన్నప్పటినుంచీ నా మనసు మనసులో లేదు. నువ్వు చల్లగా ఇంటికొస్తే సత్యనారాయణ వ్రతం చేస్తానని మొక్కుకున్నాను. రేపు నీకు కాస్త పాయసంచేసి తీసుకురానా?"

"ఏం వద్దు పెద్దమ్మా! నాకు ఏం తినాలని లేదు."

"అలా అంటే ఎలాగమ్మా! చూడు అప్పుడే ఎంత నీరసించిపోయావో! పోనీ,



నీకేది ఇష్టమో చెప్పు. అదే చేసి తీసుకొస్తాను."

"నీకెందుకు శ్రమ?"

"శ్రమా? నీకు చెయ్యటం నాకు శ్రమా? ఇప్పుడంటే అన్నావు కాని, మరెప్పుడూ అనకు. నా చేతులారా నీకు చేసిపెట్టటంకంటే నాకు ఆనందమేముంది? రేపు నీకు పాయసం తీసుకొస్తాను."

"వద్దు పెద్దమ్మా! ఇప్పుడు నేను అలాంటివి తినకూడదు."

"అయ్యో కర్మ! సరేలే! పత్యంగా ఉండు! ఈ మాయదారి రోగం నయమైతే కావలసినన్ని చేసుకోవచ్చు. ఇంక నేను వెళ్తానే! పాపం, రమణి ఒక్కర్తీ ఇంట్లో ఏం అవస్థపడుతుందో? ఏ అవసరమున్నా కాకితో కబురంపినా. రెక్కలు కట్టుకు వాలతాను."

వెళ్ళలేక వెళ్ళలేక వెళ్తున్నట్లు ఆ నడి వయసావిడ వెళ్ళిపోయింది. మాలతి మా వంక చూసి నీరసంగా నవ్వింది.

"ఈ అమ్మాయి లలిత. నా స్టూడెంట్? కథ వ్రాయటానికి మెటీరియల్ కావాలంటే, ఇక్కడికి తీసుకొచ్చాను" లలితను పరిచయం చేస్తూ అన్నాను.

మాలతి సహజంగా చాలా అల్లరిది.

ముంబంలో ఉన్నా దాని కొంటెతనం అణగలేదు.

"అయితే వుడ్ బి రచయిత్రివి అన్న మాట! గ్లాడ్ టు మీట్ యు. ఒక్క చిన్న రహస్యం అమ్మాయ్! నువ్వు కథ వ్రాసాక మీ మేడమ్‌కి చూపించకు. నాకు చూపించు. నాకు కథలు వ్రాయటం చేత కాదు కాని, ఎలా వ్రాయాలో చెప్పటం చేతనవును. అందుకే మీ మేడమ్ నా దగ్గిరకు తీసుకొచ్చింది."

"అలాగేనండి!" అని బుద్ధిగా తలూపింది లలిత. తన మాటల్లో వ్యంగ్యం అర్థం చేసుకోలేని లలితని వింతగా చూసింది మాలతి.

"మీకు ఏం జబ్బండీ?" కుతూహలంగా అడిగింది లలిత.

"ఓహ్! ఇంటర్వ్యూ ప్రారంభించావన్న మాట! ఇంకా నా జబ్బుకి పేరుపెట్టలేదు డాక్టర్లు. కథలకు 'నామకరణం' చెయ్యటం కంటె కష్టం, రోగాలకు 'నామకరణం' చెయ్యటం. రోగాల్లో చాలా కొత్త కొత్త రకాలు వస్తున్నాయి."

గుమ్మానికున్న తెర తొలగించుకుని లోపలకు వచ్చారు మాలతి భర్త రామారావు, మమ్మల్ని చూపి ఒక్కక్షణం నిలబడిపోయారు ముందుకు వెళ్ళకుండా.

"పరవాలేదులెండి. ఇలా వచ్చి ఈ కుర్చీలో కూచోండి. పరాయివాళ్ళెవరూ లేరు. మా ఆనంద మీకు తెలుసుగా? ఆ అమ్మాయి ఆనంద స్టూడెంట్! కాబోయే రచయిత్రి." అని పరిచయం చేసింది మాలతి. నేను పలకరింపుగా నవ్వాను. లలిత లేచి నించుని నమస్కారం చేసింది.

ఇదంతా పట్టించుకునేలా లేడు రామారావు. దేనికో విపరీతంగా మధనపడినట్లు వడిలిపోయి ఉంది అతని ముఖం.

"ఆ డెవిల్ ఎంత పని చేసిందో చూసావా?"

"పాయసం చేసేసిందా? బాగా కుదిరిందా?"

"నీ ముఖం! డాక్టర్, నీకు క్షయ అన్నారని చెప్పింది."

"వాట్?"

"నిజం! వాళ్ళలో వాళ్ళు అనుకుంటూంటే విందిట! డాక్టర్లు ఇలాంటివి రోగులకు,రోగుల బంధువులకు చెప్పరుట! నన్ను జాగ్రత్తగా ఉండమంది."

"ఇంత ఫూలిష్‌గా మాట్లాడితే మీరు నమ్ముతారనే అనుకుందా?"

"ఏదో మిడిమిడి జ్ఞానంతో నోటికొచ్చినట్లు వాగుతుంది. ఇదంతా ఆ రమణిని నాకు కట్టబెట్టాలని తాపత్రయం!"

"ఒకవేళ నిజంగా నాకు క్షయే అయితే ఏంచేస్తారు?" అల్లరిగా అడిగింది మాలతి. ఎదుటివాళ్ళ ఈర్ష్యలతో కూడా ఆడుకోగల మాలతి.

ఒక్క క్షణమే రామారావు ముఖం పాలిపోయింది.

"జీవితంలో నీతో ఎన్నెన్నో కష్టసుఖాలు పంచుకున్నాను. ఆఫ్టరాల్ ఈ క్షయ పంచుకోలేనా?"

"ది గ్రేట్ హీరో!" అంటూ చప్పట్లు కొట్టింది మాలతి.

రామారావు కృత్రిమ కోపంతో ముఖం చిట్లించి "మళ్ళీ వస్తాను" అని వెళ్ళిపోయాడు. లలిత తన ప్రశ్నలు ప్రారం




భించింది.

"మాలతిగారూ! డెవిల్ అంటే ఎవరండీ?"

"మా పెద్దమ్మ!"

"రమణి?"

"ఆవిడ కూతురు!"

"మీ పెద్దమ్మగారే తన కూతుర్ని మీవారికిచ్చి పెళ్ళి చెయ్యాలని చూస్తున్నారా?"

"అవును. అయితే ఆవిడ సొంత పెద్దమ్మకాదు. ఏదో దూరపు బంధువు. ఆర్థికంగా ప్రస్తుతం కొంత హీనస్థితిలో ఉంది."

"ఇందాక ఆవిడ మీరంటే చాలా ప్రేమ ఉన్నట్లు మాట్లాడారు కదూ?"

"అవును!"

"మరి ..!"

"మరి ..?"

లలిత మాట్లాడలేకపోయింది. గడియారం చూసుకున్నాను. ఆరయింది.

"లలితా! కథ వ్రాయటానికి ఈ మాత్రం చాలు! పద! వెళ్దాం!" అంటూ లేచాను.

"లలితా! కథ వ్రాసి నా దగ్గరకే తీసుకురా!" అంది మాలతి.

ఒక పదిరోజుల తర్వాత లలిత కథ వ్రాసి తీసుకొచ్చింది. "మాలతికే చూపిద్దాం పద!" అన్నాను.

"మళ్ళీ ఆస్పత్రికే వెళ్దామంటారా?"

"దేనికి? మాలతి నాలుగు రోజుల క్రిందటే ఇంటికి వచ్చేసింది."

ఇద్దరమూ మాలతి ఇంటికి వెళ్ళాం. మాలతి చాలా ఆరోగ్యంగా ఉంది. చిరునవ్వుతో మమ్మల్ని ఆహ్వానించి కూచోబెట్టి మా ఇద్దరికీ కాఫీ ఫలహారాలు అందించింది.

"మీ పెద్దమ్మగారు, రమణీ ఏరీ?" అంది లలిత.

ఏళ్ళు ఇళ్ళయాయి. ఎన్నాళ్ళుం టారు."

"అయ్యో!" అప్రయత్నంగా అంది లలిత. మాలతి మొదట ఆశ్చర్యంగా చూసి, తరువాత అర్థమయినట్లుగా నవ్వి "ఓహ్! నువ్వు కథ వ్రాసేసావా ఏమిటి? నీ కథలోలా నిజజీవితం లేనందుకు నిరాశ పడుతున్నావా? పరవాలేదులే? ఏదీ, నీ కథ ఇలా ఇయ్యి" అని లలిత చేతిలో కాగి తాలు అందుకుని గబగబ చదివింది. చదివి పక్కన పడేసింది.

"ఎలా ఉంది?" ఆరాటంగా అడిగింది లలిత.

"బాగానే ఉంది - కానీ, కథ ఎత్తు కోవటమే, "మా నాన్నగారు పనిచేసిన సినిమా తాలూకు నిర్మాత కారులోంచి దిగి...." అంటూ ప్రారంభించావు! ఏమి టమ్మా ఈ వాక్య నిర్మాణ వైభవం? సెకండ్ లాంగ్వేజ్ తెలుగే కదూ? మీ తెలుగు లెక్చరర్ ఆనందారామం కదూ!" అని నావైపు చూసి అల్లరిగా నవ్వి మళ్ళీ లలితను చూస్తూ "మీ నాన్నగారు ఒక ప్పుడు సినిమాలో నటించారనే సొంత డబ్బాకోసమా, సందర్భంలేని ఈ సాము గరిడీలు?" అని నవ్వింది.

లలిత కొంచెం చిన్నబుచ్చుకుని "ఏదో అలా ప్రారంభించాను. తరువాత కథ?" అని అడిగింది?

"బాగానే ఉందిలే! ఆ పెద్దమ్మ, రమణి, రామారావును మాలతి క్షయరోగి అని నమ్మిస్తారు. రామారావు మాలతిని వదిలేసి రమణిని పెళ్ళి చేసుకుంటాడు— హరిహరీ! ఆ తరువాత రమణి రామా రావును చాలా బాధలు పెడుతుంది. రామారావు పశ్చాత్తాపపడతాడు. చివరకు మాలతికి ఏ క్షయరోగం ఉందని దుస్సా హసంతో కల్పించిందో, ఆ క్షయరోగం తోనే రమణి కుళ్ళికుళ్ళి చస్తుంది! ఇదేగా కథ. అబ్బా! క్షయరోగాలూ - కుళ్ళికుళ్ళి చావటాలూ — దుష్టశిక్షణ, శిష్టరక్షణ, సాధించటానికే ఈ బీభత్స తాండవం? ఇంతకూ నువ్వీ కథ ఏ ఉద్దేశంతో వ్రాసి నట్లు?"

"అంటే?"

"శభాష్! అలాంటి పనికిమాలిన ఆలోచనలేవీ పెట్టుకోకుండా ఝామ్మంటూ ఎడాపెడా వ్రాసేసావా? నేను అడుగు తున్నది—నువ్వు కొత్త మెరుపు ఇయ్యా లనుకున్నావా? లేక సామాజిక స్థితి ప్రతి ఫలింప చెయ్యాలనుకున్నావా! కమ్మని ప్రణయగాథ వ్రాయాలనుకున్నావా— అని...."

"ఒక విషయం ఇన్ని రకాలుగా ఎలా వ్రాస్తారు?"

"పిచ్చితల్లీ! మనమంతా ఒక సమాజంలోనే బ్రతుకుతున్నాం. అనుభ వాలు అందరికీ ఉంటాయి. అయితే కళా కారులు తమ అంతరంగపు స్థాయినిబట్టి- తమ అనుభూతి నైశిత్యాన్నిబట్టి జీవితం లోంచి తాము చూపాలనుకొన్నది వ్యాఖ్యా నించి చూపుతారు. అదే కళ. ఉదాహర ణకు నువ్వు కథ వ్రాసిన ఇతివృత్తాన్నే తీసుకో!

(1) నువ్వు కొసమెరుపు ఇవ్వాలను కొంటే "మాలతీ రామారావులు అన్యో న్యానురాగంతో ఉండే దంపతులు. మాలతి ఆస్పత్రిలో ఉండగా పెద్దమ్మ




స్వార్థంతో మాలతికి క్షయరోగం ఉందని అబద్ధమాడుతుంది. మాలతి భరించలేక, డాక్టర్లను కన్సల్ట్ చేస్తే అది నిజమేనని తెలుస్తుంది. బలహీనురాలైన మాలతి షాక్‌తో గుండె ఆగి చచ్చిపోతుంది. రామారావు పెద్దమ్మను, రమణినీ చీదరించుకుని, మాలతికి క్షయ ఉన్నట్లు తనకు మొదటినుంచీ తెలుసుననీ—ఇంత కాలం మాలతికి ఆ రహస్యం తెలియకుండా కాపాడుకొంటూ వస్తున్నాననీ అంటాడు. పెద్దమ్మ, రమణి, తమ కారణంగా నిండుప్రాణం బలిపెట్టుకున్న మాలతి అమాయక స్వరూపం తమను వెన్నాడగా అశాంతిలో మగ్గిపోతారు ..."

(2) నువ్వు సామాజిక స్థితి ప్రతిఫలింప చెయ్యాలనుకొంటే—

"రమణికి వయసు మీరిపోయింది. చదువులేదు, ఉద్యోగం లేదు, అందం లేదు. ఏం చేస్తుంది? ఇంకా పెళ్ళి కాలేదా? అంటూ పెద్దమ్మను కొరుక్కుతినే అమ్మలక్కలు! ఈ పాడు సంఘానికి ఏదో ఒక పెళ్ళంటూ అయితే చాలు! తన తప్పు ఏంలేకపోయినా తన మనసును చిల్లులు పొడిచే ఆ సంఘంపైన కసితో మండిపోతోంది రమణి మనసు— న్యాయం, ధర్మం ఎక్కడున్నాయి ఇవి? శ్రీరంగనీతులకేం? అందరూ చెప్తారు. ఎవరి స్వార్థం వాళ్ళది! ఒకవేళ తాను చేస్తున్నది నేరమే అయితే, ఆ నేరం తనది మాత్రమే కాదు. తనను ఈ స్థితిలో నిలిపిన సంఘానిది కూడా...."

(3) నువ్వు మధుర ప్రణయగాథ వ్రాయాలనుకొంటే ...

మాలతీ రామారావులు పరస్పరం

ప్రేమించుకున్నారు రమణికి కూడా రామారావుమీద కన్ను పడింది రమణి సామాన్యురాలు కాదు నాయకురాలు నాగమ్మ రాణి రుద్రమ్మ-చండప్రచండిక: రమణి ఎత్తుజిత్తులకు రామారావు చిత్తైపోయి రమణివైపు మొగ్గాడు మాలతి అశాంతితో అనారోగ్యాన్ని వరించి మంచమెక్కింది ఇక్కడ రమణి ఒక పెద్ద బ్లండర్ చేసింది స్నేహంలో మాలతి తనకు చెప్పుకున్న కష్టసుఖాలు వికృతీకరించి రామారావుకు చెప్పింది మాలతిపై అసహ్యం కలిగేలా అయితే మాలతి ఏనాడూ రామారావు దగ్గిర ఏ విషయమూ దాచలేదు తన మంచిచెడ్డలన్నీ స్పష్టంగా రామారావుకు చెప్పిన తరువాతనే ఆత్మార్పణ చేసుకుంది అంచేత రమణి అల్పత్వం రామారావులో అసహ్యాన్నీ, ఆవిడపట్ల భయాన్నికూడా కలిగించాయి మాలతిని వెతుక్కుంటూ వచ్చాడు. మంచంలో ఉన్న మాలతి కాంతిలేని కళ్ళతో "రమణి ఏదీ?" అని అడిగింది

"నేను రమణితో వస్తే నువ్వు భరించగలవా?"

రామారావుతో అబద్ధమాడగలిగే శక్తి మాలతికి లేదు

"భరించలేను కానీ ఏం చెయ్యగలను? చెయ్యిజాపి మీ ప్రేమను యాచించగలనా? దెబ్బలాడి మీ మనసులో స్థానాన్ని పొందగలనా? అనివార్యమైన దానికి అలవాటు పడాలనే సాధన చేస్తున్నాను"

కన్నీళ్ళు నిగ్రహించుకొంటూన్న ఆ ముఖం చూసి రామారావు కదిలిపోయాడు

"నేను చెయ్యిజాపి నీ క్షమాభిక్ష యాచిస్తున్నాను దెబ్బలాడి అయినా సరే నిన్ను నా గుండెల్లో దాచుకుంటాను" అంటూ రెండుచేతులూ జాపి మాలతిని అక్కున చేర్చుకున్నాడు"

శ్రద్ధగా వింటోన్న లలిత "భలే బాగుంది" అంది

ఏ దృక్పథంలోంచి వ్రాసినా బాగానే ఉంటుంది, దృక్పథం అంటూ ఉంటే? మరి నువ్వో? పాచిపోయిన పాత చింతకాయ పచ్చడి ఫ్రేంలో ఊపిరాడకుండా బిగించి, జీవచ్ఛవాన్ని చేసి వదిలావు నీ కథని! నీ కెందుకొచ్చిన యాతనకానీ, ఆ కాగితాలు ఇలా పారెయ్యిపోనీ, నేను వ్రాసిపెట్టనా?"

ఝాళ్ళకర్ర సూత్రాలకందని స్వచ్ఛంద రీతిలో సాగే కళాస్రవంతిలా కలకల నవ్వింది మాలతి



# గెటప్

"కవిత"



భవిష్యత్తుని గురించి ఆలోచిస్తూ ఆ గదిలో పచార్లు చేస్తున్న రఘుని అకస్మాత్తుగా గాజు తలుపుల వెనకవున్న ఒక వస్తువు ఆకర్షించింది. అల్మైరా తాళం తీసి దానిని చేతిలోకి అందుకున్నాడు. అదొక డైరీ.

డాక్టరుగారు డైరీ రాసేవారా! ఎప్పుడు?

రఘు ఆశ్చర్యపోయాడు. అంతలోనే అతనికి ఆశ కలిగింది. తన మెదడుని వేధిస్తున్న ప్రశ్నకు యీ డైరీ ఏమయినా సమాధానం చెబుతుందేమో?

కాని—ఇతరుల డైరీ చదవడం తప్పు కాదూ?

ఊహుఁ. ప్రస్తుత పరిస్థితులలో అంతకంటె గత్యంతరంలేదు. డైరీని తను స్వార్థంకోసం వినియోగించుకోడు.

ఇక ఆలోచన కట్టిపెట్టి డైరీ చదవసాగాడు.

* * *

19-1-67 :

నేనొక ఓడిపోయిన డాక్టర్ని. మెడిసిన్ పూర్తిచేసి పట్నంలో ప్రాక్టీసు పెట్టాను. ఎన్నాళ్ళయినా నన్ను డాక్టరుగా ప్రజలు గుర్తించలేదు. నా సేవలు వారి కవసరంలేక పోయాయి. తప్పు నాదికాదు. మిగిలిన డాక్టర్లు రకరకాల మార్గాలలో పేషంట్లని ఆకట్టుకునేవారు. నాకవిచేతనయ్యేవి కావు. అందుకే అటు డాక్టర్లూ యిటు ప్రజలూ కూడా నన్ను "ప్రాక్టీసు లేని డాక్టరు" అని హేళన చేసేవారు. క్రమక్రమంగా నా ఓర్పు నశించిపోయింది. ఇక భరించ లేక—పట్నం నుంచి వెళ్ళిపోయేందుకు నిర్ణయించుకున్నాను, బోర్డు తీసేసి బయలుదేరాను. నావెంట అర్ధాంగి. బయటకు నవ్వదు కానీ ఆమెకూడా యీ ప్రాక్టీసు లేని డాక్టర్ని చూసి నవ్వుకుంటూనే వుంటుంది లోపల. పట్నం వదులుతూనే గమ్యం నిర్ణయించుకున్నాను. అటు పల్లె యిటు పెద్ద పట్నమూ కాని మధ్యరకం వూరు. అదే నాకు తగిన స్థలం అనిపించింది.

ఒక మేడమీద చిన్న వాటాలో దిగాను. బోర్డు తగిలించాను.

నా అదృష్టం బాగుంది. బోర్డు తగిలించిన మొదటి రోజునే టైఫాయిడ్ కేసు తగిలింది. పేషంట్ యింటికి వెళ్ళి ఇంజక్షనిచ్చాను.

30-1-67 :

నా పేరెవరికీ తెలియదు — మేడమీద డాక్టరుగా తప్ప. ఈ పదిరోజులలోనూ

వాతికి కనులు తగిలాయి! నన్ను నేను నమ్మలేకపోతున్నాను నాకు మహదానం దంగా వుంది పేషంట్లు ఎంత యిస్తే అంత పుచ్చుకుంటున్నాను మనస్ఫూర్తిగా వాళ్ళని పలకరిస్తున్నాను సాకల్యంగా వాళ్ళని పరీక్షిస్తున్నాను వెంటనే గుణం కనిపించే మందులు వాడుతున్నాను నామీద పేషంట్లుకు నమ్మకం కలిగించు కుంటున్నాను

నా సమర్థతకు గుర్తింపు లభిస్తోంది

15-2-67

అర్ధరాత్రయినా పేషంట్‌ని చూడవలసి వస్తే వెళ్తున్నాను అవసరమయితే నడిచి వెళ్ళడానికి కూడా వెనుకాడడంలేదు ఎప్పుడు ఎవరు పిలిచినా కాదనే మాట లేదు ఎక్కడికయినా వెళ్ళడమే అందుకే చాలామంది నన్ను గుర్తిస్తున్నారు

15-8-67

నేను డాక్టర్ననిపించుకుంటున్నాను ఇదే తరుణం ఇన్నాళ్ళూ తీరని నాకసి యిక తీర్చుకోవాలి డిస్పెన్సరీ ప్రారంభించాను త్వరలో హాస్పిటల్ పెద్దది చేయాలి ఇప్పుడు నాకు చాలా కొత్తాలు ఏర్పడుతున్నాయి నిలుపుకోవాలి నాహస్తవాసి మంచిదని చెప్పుకుంటున్నారట చాలు ఇక నేను గెలవగలను

20-11-67

కొన్ని సదుపాయాలతో హాస్పిటల్‌ని వృద్ధిచేశాను నాకు గర్వంగావుంది ఒక విజయం సాధించాను ఈ వీధిలో డాక్టర్లు మరో వీధికి తరలిపోయారు ఈ వీధిలో నేనొక్కణ్నే డాక్టర్ని! ఇంట గెలుస్తున్నాను ఇక రచ్చ గెలవడానికి రంగం సిద్ధంచేసుకోవాలి నేను వైద్య రాజుని నా సామ్రాజ్యాన్ని పెంచుకుంటూ పోవాలి ఈ వీధి యీవూరు అలాగ ఒక్కొక్కటీ వశపరచుకుంటూపోవాలి

1-5-68

స్వంత హాస్పిటల్ కట్టుకోగలిగాను పెద్దయిల్లే కట్టించుకున్నాను సంఘంలో పలుకుబడి హెచ్చుతోంది మిగతా డాక్టర్లు నన్ను గౌరవించడమే కాదు చూసి భయ పడుతున్నారు కూడా ఇప్పుడు నా వేషంలో చాలా మార్పువచ్చింది డాబుగా తయారౌ తున్నాను లేకపోతే బాగుండదు రోరింగ్ ప్రాక్టీసున్న డాక్టర్ని, ప్రాక్టీసు లేని డాక్టర్లా ఎలా వుండను? ఇల్లు కట్టించడానికి చేసిన అప్పు తీరిపోగానే కారు కొనాలి ఇంత ప్రాక్టీసుండి కారు లేకపోతే ఎలా?

1-10-68

ఇంటిమీద అప్పుతీరిపోయింది తీరి పోక ఏమౌతుంది? నేను గమనించడం లేదు కానీ నాకీర్తి చాలా దూరం వెళ్తోంది నన్ను సాక్షాత్తూ ధన్వంతరే అనుకుంటు న్నారు చుట్టుపక్కల వీధులకీ నేనే డాక్టర్ని నాచుట్టూ ఎటుచూసినా అరమైలు దూరంలో మరో డాక్టరుకి నీడలేదు నేను మర్రిచెట్టులా విస్తరిస్తున్నాను ఒక్కొక్క డాక్టరూ నాకు దూరంగా పిరికిపందలా పారిపోతూంటే ఒకే తమాషాగా వుంది

జాలి? నామీద ఆనాడు ఎవరయినా చూపించారా జాలి? నన్నణగదొక్కడానికీ ప్రయత్నించారు ఇప్పుడు నేనెవరి మీద మాత్రం ఎందుకు జాలిపడాలి? డార్విన్ సిద్ధాంతం సర్ వైవలాఫ్ ద ఫిట్టెస్ట్



జ్యో







తిరుగులేని నిజం. జీవితానికే కాదు. ప్రొఫెషన్‌కి కూడా. నీతి సూత్రాలు పట్టుకు వేలాడితే జీవితంలో మనిషి ఎలా రాణించ లేడో, అలాగే ప్రొఫెషనల్ ఎథిక్స్ పట్టు కు్కుర్చుంటే డాక్టరు వృత్తిలోనూ రాణించలేడు.

1-3-69 :

ఎంత తేడా! అప్పుడు నేను పేషంట్ల కోసం పరుగెత్తిన రోజులు కలలాగ అసత్యంలా అనిపిస్తున్నాయి. ఇప్పుడు నాకోసం ఎందరు పరిగెత్తుకువస్తున్నారు! నాదగ్గర ట్రీట్‌మెంట్ తీసుకోవడం—ఫలాగా డాక్టర్ తాలూకు పేషంట్‌నని చెప్పుకోడం—ప్రజలకి గర్వమట!

ఆపరేషన్ థియేటరు కట్టించడం మంచి పని చేశాను. దానివల్లనే కారు కొన్నాను. ఇంట్లో రెండుగదులు ఎయిర్ కూల్డ్ చేయించాను. అర్ధాంగి మెడలో పాతికతులాల బంగారం నిలపగలిగాను వీటన్నిటి మాటకేం? మిగిలిన డాక్టర్ల కాతాలు కూడా నాకు చేరుకున్నాయి. ఇదీ నాకు కావలసింది. ఇదే. డబ్బు కేముంది? ఎక్కువ సంపాదించినా టాక్స్ కట్టడమే కద?

1-5-70 :

నేను ఎదిగిపోతున్నాను. కోరుకున్నంత గానూ ఎదుగుతున్నాను. ఇక నా కల నిజ మయ్యే రోజు అట్టేదూరంలో లేదు. నా కసి తీరుతుంది. ఇటు మైలూ అటు మైలూ ఎటుచూపినా డాక్టరు లేదు. నేను తప్ప.

సెభాష్..గమ్యానికి దగ్గరౌతున్నాను.

ఈ వూళ్ళోనే ఏ డాక్టరూ ఉండ కుండా....అదీ..అప్పుడూ....ఆ శుభదినం రావాలి.వస్తుంది. అతిత్వరలోనే వస్తుంది.

1-5-71 :

ఇంక యిద్దరే డాక్టర్లున్నారు నూటికి

తొంభై మంది పేషంట్లకి నేనే డాక్టర్ని. ఎక్స్‌రే....బ్లడ్ టెస్టులు..అన్నీ అమిరిన నా హాస్పిటలుకీ నర్సింగ్ హోమ్‌కీ కాకుండా ఏ సదుపాయాలూ యివ్వలేని ఆ డాక్టర్ల దగ్గర కెవరు వెళ్తారు? తాలూకా అంతటి లోనూ నా పేరు మారుమ్రోగి పోతూంది. డాక్టరంటే నేనే!....అదట ప్రజల అభిప్రాయం! ఎవరో అన్నారు - నేను ఎలక్షన్‌లో నిలబడినా బోలెడంత మెజారిటీతో ఎన్నికై పోతానట.

కాని-నాక్కావలసింది ఎలక్షన్లు కావు. డబ్బు కాదు... ప్రాక్టీస్.. నా కసి తీరాలి. పూర్తిగా తీరాలి.

తీరుతుంది. నా హాస్పిటల్ ఆవరణ చూస్తూంటే చాలు. కిటకిట లాడుతుంది పేషంట్లతో. బళ్ళల్లో,,రిక్షాలో..కార్లలో.. పేషంట్లు, పేషంట్లు....పేషంట్లు. చుట్టు పక్కల గ్రామాలనుంచి కూడా అందరూ యిక్కడకే. చూస్తూంటే ఎంత సంతోషంగా ఉంది! ఇంకెంత? ఆ యిద్దరు డాక్టర్లలోనూ ఒకడు వెళ్ళిపోయే సన్నాహాలలోనే ఉన్నాడట. హుం. వెళ్ళకేం చేస్తాడు?

1-8-72 :

ఇంకొక్క డాక్టరు. అతనూ వెళ్ళిపోతే నా కోరిక పూర్తిగా నెరవేరుతుంది. ఇదేమిటి? ఇవాళ తనకి అలసట వస్తూంది? బ్లడ్‌ప్రెషర్ ఎక్కువౌతున్నట్లు .. ఛీ ... తనకి జబ్బేమిటి? పేషంట్లని చూడడం లోనే తనకి పద్దెనిమిది గంటలు పైగా గడుస్తున్నాయి. నేను పిలిస్తే బోలెడంత మంది డాక్టర్లు వచ్చి అసిస్టెంట్లుగా చేరుతారు. కాని-వొద్దు. ఒక్కడినే. అసహాయ శూరుడినై-విజయం సాధించాలి. అయినా ఆ డాక్టరు మరీ మొండివాడిలా ఉన్నాడేం? ప్రాక్టీసు బొత్తిగా లేకుండా ఎలా బతుకుతున్నాడు? పూర్వులు సంపాదించిన ఆస్తిని కరగబెట్టు కుంటున్నాడు కాబోలు. పూర్ ఫెలో.

వాడికి నా తడాఖా పూర్తిగా తెలిసినట్లు లేదు.

పోనీకదా అని వదిలేస్తున్నాను. చూద్దాం ..యింకా ఎన్నాళ్ళు పట్టుకు సాగుతాడో. కొంచం విశ్రాంతి కావాలని పిస్తూంది. అలసట అనిపిస్తోంది. వీల్లేదు. ఆ చిట్టచివరి డాక్టరు కూడా వెళ్ళిపోయే వరకూ-నేనూ నిద్రపోలేను. గమ్యానికి అతిదగ్గరగా వచ్చేశాను. ఇంకెంత? కొన్ని రోజులు. మహాఐతే కొన్ని నెలలు. అంతే. విజయానికి తిరుగులేదు. గెలుపు నాదే.

1-2-73 :

వండర్‌ఫుల్ ! .. ఎక్సలెంట్. నేను గెలిచేశాను. ఆ ఒక్క డాక్టరూ కూడా వెళ్ళిపోయాడు. ఈ వూళ్ళో నేనే వైద్యరాజుని. నాకు తిరుగులేదు. ఎదురులేదు. ఏకచ్ఛత్రాధిపత్యం. మెడలో స్టెతస్కోప్ వేసుకునేవాడు యీ తాలూకాలో నేను తప్ప మరొకడు లేడు. నా కసి తీరింది. నా పగ చల్లారింది. నా కోరిక నెరవేరింది.

అరె! నా వేళ్ళు.... మొండికేస్తున్నాయేం?

పెన్...అయ్యో...నాకేమిటౌతూంది?

శరీరం....

* * *

డాక్టరుగారి గదిలో శబ్దం విని పరుగెత్తాడు రఘు. డాక్టరు-కింద పడిపోయి ఉన్నాడు. ఆయనకి స్పృహ లేదు.











"డాక్టర్ని పిలవండి. డాక్టరుగారు పడిపోయారు-" అరిచాడు. నలుగురూ పోగయ్యారు. కాని—ఎక్కడున్నాడు డాక్టర్?

ఈ పరిసర ప్రాంతాలలో మరేడాక్టరూ లేడు. ఇప్పుడెలా?

పట్నంలోని డాక్టరుకి ట్రంక్ కాల్ చేశాడు. ఎనభై మైళ్ళ దూరంనుంచి ఆయన రావాలి. అక్కయ్య ఏడుస్తోంది-డాక్టరు భార్య ఐవుండి కూడా. "విసుగూ విరామమూ లేకుండా, అర్ధరాత్రి వరకూ ఒకే యిదిగా కష్టపడేవారు. ఆరోగ్యం జాగ్రత్త అని ఎన్నిసార్లు చెప్పినా వినేవారు కారు. ఆయనకి హాస్పిటలూ పేషంట్లూ తప్ప యిల్లూ యిల్లాలూ పిల్లలూ వీళ్ళమీద ధ్యాసే ఉండేదికాదు. నేనెంత మొత్తుకున్నా వింటేనా?....

డాక్టరుగారు తనకి బావగారే అయినా-తనూ అందరిలాగే డాక్టరుగారూ అని పిలిచేవాడు. అలా పిలిస్తేనే ఆయనకు తృప్తిగా ఉండేది.

అహోరాత్రులూ వైద్యవృత్తి కంకితమయిపోయిన ఆయన తనకి పిచ్చివాడిలా తోచేవాడు. ఆయన తాపత్రయాన్ని చూసి జాలి పడేవాడు.

. డాక్టరుగారు చనిపోయారు-వైద్యుడు సకాలంలో రాలేక.

* * *

ఆ కుటుంబం ...అక్కయ్య కుటుంబానికి-తను అండగా నిలిచేడు రఘు. డాక్టరుగారు విల్లంటూ ఏమీ వ్రాయలేదు. ఆయనకేం కోరికలున్నాయో అర్ధాంగికి కూడా తెలియదు. ఆయన చనిపోయారు. ఈ హాస్పిటలూ ...మెడికల్ ఎక్విప్మెంటూ ఏం చేయాలి? పిల్లలు పెద్దయ్యే వరకూ ఆగడం అసాధ్యం. డైరీలో తన ప్రశ్నకు సమాధానాలు దొరకలేదు కానీ బావగారి జీవితం కనులకు కట్టింది. నిట్టూర్పు వదులుతూ అనుకున్నాడు రఘు. "బావా! మరొక డాక్టర్నయినా నువ్వు మిగలనిచ్చి ఉంటే, నువ్వు మాకు మిగిలేవాడివేమో?"



# రాంగ్ నంబర్

షీలా శివరామ్

ఫోన్ గణగణ మోగింది. పాపనాశనం గారు ఫోనెత్తి 'హల్లో' అన్నారు.

'అయ్యా నమస్కారం' అంటూ వినిపించింది.

'నమస్కారం.'

'అయ్యా అమ్మాయికి పెళ్ళి నిశ్చయమయిందట గదా! అభినందనలు స్వీకరించండి స్వామీ. మొత్తానికి 'బిగ్ షాట్'ని పట్టారుటగదండీ బాబూ!'

'హీ హీ థేంక్స్. మీరూ .. '

'అయ్యో. నేనండీ బాబూ. నేను .. ఇంకా గుర్తురాలేదా? భలేవారండీ, ఆరోజు రైల్లో ఫస్టుక్లాసు కంపార్టుమెంట్‌లో '

'........'

'మొత్తానికి బ్రహ్మాండమయిన సంబంధం కొట్టేశారులెండి. పోలీసు కమీషనరు మొన్న క్లబ్బులో కనబడి చెప్పాడు ఇలా అని.'

'ఒహోహో!!!'

'ఇంతకీ ఏవూరన్నారు?'

'అమలాపురం దగ్గిర....'

'ఒహోహో మరి చెప్పరేం?! మన ఇర్రిగేషన్ మినిష్టరు ఆ వూరివాడే! మొన్న నే మా ఇంటికి డిన్నర్‌కి వొచ్చాడు. ముందు తెలిసిందిగాదే! వివరాలు తెలుసుండేవి.'

'ఓహో, అయ్యా తమరు ...'

'ఇంతకీ పేరేవిటన్నారు ...'

'ఫణీంద్రుడుగారని....'

'ఓహోహో ఫణీంద్రుడుగారి పుత్రడన్నమాట. మరి చెప్పరేం ఆ మాట! ఆయన తెలియకపోవటమేవిటండీ! అయ్యా మీరు 'బంగారపు గనిని పట్టేశారండీ బాబూ. డబుల్ కంగ్రాచులేషన్స్.'

'థేంక్స్. థేంక్స్.'

'అయ్యా తమ టెండరెంత స్వామీ. హైయ్యెస్టు మీదే అయ్యుంటుంది లెండి. అందుకే ఛాన్సు కొట్టేశారు.'

'హి హి. ఏదో అంత లేదులెండి.'

'ఏం మొహమాటపడతారండీ స్వామీ. రత్నాలు వూరికే దొరుకుతాయటండీ అయ్యా నైవేద్యం లేనిదే భగవంతుడు మాత్రం వరమిస్తాడుటండీ మీ పిచ్చిగానీ. ఎన్ని లకారాలో చెప్పారు గాదు?"

'ఎంతో ఎక్కడ లెండి. ఒకటిన్నర.'

'భేష్ భేష్. అదృష్టవంతులండీ. పెళ్ళికి మీకు కావల్సిన పంచదార సప్లయి నాదే ననుకోండి. తెలిసిన వాడొకడున్నాడుఅలైనులో. అయ్యా మొహమాట పడకుండా నాకు ఫోనుచేసి చెప్పండి."

'అయ్యా తమరూ . .'

'ఇంతకీ కుర్రవాడికి ఏం పనన్నారు?'

'..... .'

'బాప్‌రే. అదృష్టవంతే మీదేనండీ. మీతో పరిచయం వున్నందుకు మేము గర్వపడాలి స్వామీ.'

'ఇంతకీ అబ్బాయి మాంఛి కీలక





స్థానంలో వున్నాడన్నమాట బంగారు బాతుని పట్టేశారు స్వామీ

'హి హి థేంక్స్

'ఆ. ఊ అంటూ నమ్చుకొడతారేవి టండీ రేపీపాటికి మీరు ఎమ్ ఎల్ ఎ అవబోతూ అయ్యా పెళ్ళికి అవసరమైతే మావి రెండు కార్లు నాలుగు టేక్సీలు పంపిస్తాను వాడుకోండి '

'హిహి ఏదో మీ అభిమానం, దయ '

'నా దయేమిటండీ బాబూ మధ్యలో ఇంతకీ అబ్బాయి వంశం గట్రా భేషయిన వన్న మాట।'

'అబ్బో। బ్రహ్మాండమయిన వంశ మండీ అబ్బాయికి కావాల్సిన వాళ్ళంతా హై పొజిషన్స్‌లో వున్నారు మచ్చలేని వంశం, నాలుగు తరాలకి సరిపడ ఆస్థి బాకులాటి కుర్రాడు లెండి। ఏకైక వారసుడు లెండి '

మరింకేం బాబూ అందుకే తమరిది హైయ్యెస్టు టెండరు। అయ్యా। మా కుటుంబం తరఫున అభినందనలు స్వీకరించండి

'కృతజ్ఞుడ్ని ఇంతకీ తమరు

'ఏమిటండీ బాబూ ఇంకా 'తమరు'

'తమరు అంటూనే వున్నారు।। ఇంకా నేనెవరో గుర్తించలేదా స్వామీ।

'తమరు

'నేనండీ బాబూ పాచికల పాండురంగ రావుని ఇంతకీ మీరు వైకుంఠంగారవునా కాదా।'

'వైకుంఠం ఎవడండీ।। నేను పాప నాశనాన్ని।'

'ఓహోహో। సారీసర్। చ్చొచ్చె। రాంగ్ నంబర్ సర్। నాకు వైకుంఠం గారు కావాలి ఎక్స్క్యూజ్ మీ సర్।సారీసర్।

* * *

మరుసటి నెల పాచికల పాండురంగ రావుగా రమ్మాయికి, ఫణీంద్రుడిగా రబ్బాయికి ఆకాశమంత పందిరికింద, భూదేవంత అరుగుమీద బ్రహ్మాండంగా పెళ్ళి జరిగిపోయింది హైయ్యెస్టు టెండరు పాచికలవారిదేనని చెప్పనవసరంలేదుకదా।***

★ చెల్లూరి సీతారాజేశ్వరరావు

# సీతమ్మ సంతానం



సామ్రాజ్యం టీ గ్లాసులు లోపలకి పట్టుకెళ్ళబోతూ ఆగిపోయింది. గదిలో నుంచి రంగారావు, శర్మల కంఠాలు తారాస్థాయిలో వినబడుతున్నాయి. వాళ్ళు చర్చించేది తన విషయమే కావడంతో సామ్రాజ్యం లోపల కెళ్ళలేకపోయింది. హాల్లో ఒకమూల దుప్పటి కట్టి ఆడుకుంటున్న పిల్లల్ని నెమ్మదిగా కేకవేసింది, టీ వారిద్వారా పంపిద్దామని. ఆటలు వదిలిపెట్టి రాలేదు వాళ్ళు.

"ఏమిటి మరదలా అజంతా బొమ్మలా నిలబడిపోయావు" పతంజలి సిగరెట్ కాలుస్తూ వచ్చాడు. అప్పుడే నిద్ర లేచాడేమో, ముఖంమీద జుట్టు దోబూచులాడుతోంది.

"అబ్బే .. " సామ్రాజ్యం నసిగింది.

పతంజలి లోపలకి వెళ్ళాడు. అతడి వెంట నడవడంతో సామ్రాజ్యం బెరుకు తీరిపోయింది. "అంతరంగిక సమావేశానికి మేం రావచ్చా" పతంజలి వాళ్ళని పరీక్షగా చూస్తూ అన్నాడు.

"నీకూ భాగముంది" రంగారావు టీ త్రాగుతూ అన్నాడు.

ఆరిపోతున్న దీపంలా కలవర పడుతోంది సీతమ్మ. అల్లుడు రావడంతో బీరువా వెనక్కి జరిగింది. సామ్రాజ్యం తల్లిపాదాల దగ్గర కూర్చుంది.

"వెంకటపతి సంబంధానికి అమ్మ ఒప్పుకోవడం లేదు. ఆచారంగా చెయ్యాలంటే యిప్పుడన్నీ కుదురుతాయా? చుట్టూరా నాన్నగారు చేసిన అప్పులున్నాయి. అవి తీర్చవద్దూ? వేలకివేలు కట్నాలు పోసి సంబంధాలు చెయ్యడం

మాటలా?" రంగారావు తీవ్రంగానే అన్నాడు.

వెంకటపతి!!! సామ్రాజ్యం గుండె ఝల్లుమంది. వెంకటపతిది ఆ ఊరే. నలభై యేళ్ళుంటాయి. ఇటీవలే భార్య పోయింది కూడ.

"మావగారుంటే ఈ సంబంధం చేసే వారా?"

శర్మ పూర్తిచేశాడు "లేరు కనుకనే."

"మీ తోబుట్టువు భవిష్యత్తుపై మీకు పూచీలేదు మాట."

ఎదురుగావున్న మంచంమీద కూర్చుని పిల్లడికి పాలిస్తున్న ప్రమీల కోపంతో చిరచిర లాడిపోయింది. భర్త సమస్యని మరోవైపుకి లాగుతున్నాడు.

"వాళ్ళ శక్తినిబట్టి వాళ్ళు చేసు కుంటారు. మీకెందుకు గొడవ" కసిరింది.

"నీ పెద్దన్న నాకూ భాగముందని చెప్పాడే."

"అంత జాలిగా వుంటే మరదలి పెళ్ళి మీరు చెయ్యకూడదూ?"

సామ్రాజ్యం అందరి ధోరణీ కని పెడుతోంది. పరాయివాడు చూపించే అభి మానం సొంతవాళ్ళు చూపించడం లేదు. నాన్న పోవడంతో తను వీరికి భారమై పోయింది. ఏదోలా పెళ్ళయిందనిపించి చేతులు కడుక్కోవాలనుకుంటున్నారు.

"ఏమండీ తెమల్లేదూ?" శర్మ భార్య సుశీల బయటనుంచి కేకవేసింది.

శర్మ లేచాడు. తల్లిదగ్గరకెళ్ళి "వస్తా నమ్మా ...పీలు చూసుకుని మళ్ళీ వస్తాలే" అన్నాడు పొడిగా.

పదమూడో రోజున వుండకూడదని లేచిపోయే యితర బంధువుల్లాగే కనిపిం చాడు శర్మ ఆమెకి. మరో నాలుగురోజు లుండి యిక్కడి విషయాలు చూసుకోమని చెప్పాలనుకుంది సీతమ్మ. ఇంతలో సుశీల అత్తగారి దగ్గరగా వచ్చి, "రైలు దాటిపోతుంది" అంది భర్తని గదమా యిస్తూ. సుశీల భయం సుశీలది. తన మొగుడు వైద్యంచేసి అంతో యింతో సంపాదిస్తున్నాడు. కట్నం నువ్విచ్చుకోవా లని భర్తని ఒప్పిస్తారేమోనని ఆమె భయం.

"నేను చెబితే వింటారేమిటి నాయనా, ఎవరిష్టం వారిది. ఏలాగూ నేను మూలన పడ్డాను కదా!" సీతమ్మ విచారంగా అన్నది. సీతమ్మకి పానకం త్రాగాక ఉప్పు నీళ్ళు త్రాగినట్లుంది. విస్తృతమైన జీవితం కుదించుకు పోయింది. భర్త పోయిన విచారం ఆమెని యింకా వదిలిపెట్టలేదు. కళ్ళు ఉబ్బాంగాయి.

"మీరు బాధ పడకూడ దింక" పతం జలి కేకవేశాడు.

లాంఛనంగా నలుగురుతో చెప్పి శర్మ భార్యా వెళ్ళిపోయారు. "వాడికి బాధ్యత లేదు. నా కొచ్చిం దంతా" రంగారావు స్వగతంగా అన్నాడు.

"కావాలంటే నువ్వూ తప్పించుకో వచ్చు" పతంజలి వెటకారం విసిరాడు.

నాలుగయిన్నట్లు చూపిస్తోంది గడి యారం. ఎండగా వున్నా శ్రావణమేఘాలు వర్షాన్ని కుమ్మరిస్తున్నాయి. పచ్చటి చెట్లు ఎండా-వానలో మెరుస్తున్నాయి.

శంకరనారాయణ దేహాంతర కర్మలు ముగియడంతో వచ్చిన బంధువులు,

మిత్రులు నెమ్మదిగా జారుకున్నారు. ఇల్లంతా శూన్యంగా వుంది. పీడకళ వుట్టి పడుతోంది. ఇన్నాళ్ళు తమ మధ్యవున్న మనిషి లేని లోటు స్పష్టంగా కనిపిస్తోంది. సీతమ్మకీ, సామ్రాజ్యానికి మరింత స్పష్టంగా కనిపిస్తోంది.

శంకరనారాయణ ప్రయోజకుడనే చెప్పాలి. మధ్యలో లంచాలవల్ల ఉద్యోగం పోగొట్టుకున్నా ఖాళీగా కూర్చోలేదు. అమ్మకాలు, కొనుగోలు వ్యవహారాల్లో తన లౌక్యం వుపయోగించి నాలుగురాళ్ళు సంపాదించాడు. పదివేలు కట్నమిచ్చి ప్రమీల పెళ్ళి చేశాడు. శర్మని డాక్టరు చేశాడు. రంగారావుచేత మందులకొట్టు పెట్టించాడు. ఎవరికీ లోటు చెయ్యలేదు. సామ్రాజ్యం పెళ్ళికికూడ నిల్వ చేశాడు. కాని అది ఖర్చుపెట్టడం రంగారావు, శర్మకి యిష్టంలేదు.

ప్రమీలకీ యిష్టంలేదు. తల్లి నగలు వగైరాలు పుచ్చుకోడానికి అన్నలకి మద్దత్తు ప్రకటించింది.

వీళ్ళ స్వార్థాలకి సీతమ్మ మనస్సు వుడికిపోతున్నది.

"సామ్రాజ్యాన్ని అడగరా అన్నయ్యా" ప్రమీల అన్నది.

ఆ యింట్లో యితర సమస్యలనేకం వున్నవి. ఎవరి సమస్యలకి వారే పరిష్కర్తలు. ఇది ఒక కన్నె జీవిత సమస్య. అందుకే వుమ్మడి సమస్యయి కూర్చుంది. అభిమానాలు, మమకారాలు వుంటే యింత బహిరంగంగా చర్చించే అవకాశం లేదు. అది లేకపోవడంవల్ల డబ్బుదగ్గర స్వార్థం చేత సామ్రాజ్యం పెళ్ళి చర్చావేది కయింది.

"దాని అన్నలు యింత గతిలేనివారట్రా పెద్దబ్బాయి" సీతమ్మ విచారాన్ని మరచి పోయి ముందుకు వచ్చింది. భర్తపోయిన దుఃఖం జీవితాంతం వుండేదే. ఇప్పుడు తను మౌనం వహిస్తే సామ్రాజ్యం బ్రతుకు బండలవుతుంది.

తల్లికి సమాధానం చెప్పలేక రంగారావు రౌద్రంగా చూశాడు. పతంజలి నవ్వాడు. దాంతో రంగారావు కోపం యింకా ఎక్కువయింది.

"వెంకటపతి సంబంధానికేం తక్కువే అమ్మా. వుద్యోగం మంచిది. రెండెకరాల పొలంవున్నది. పిల్లలులేరు. కట్నం యివ్వక్కర్లేదు" ప్రమీలా అంది.

"అది మాట మీ బాధ? అలా మేం బాధపడివుంటే మీరెలావుండేవారు?"

రంగారావు కిదంతా చిరాగ్గా వుంది. "యింతకీ ఏం చేద్దాం మరి?"

"చెప్పేదేముందిరా.... అమ్మకిష్టం లేదు."

"నీ వరుస చూస్తోంటే నీకభ్యంతరం లేనట్లుందే" పతంజలి అడిగాడు.

ప్రమీల భర్తకేసి రుషగా చూసింది.

"నువ్వెన్ని సంబంధాలు తిరగ్గొట్టావో జ్ఞాపకం లేదా?"

"మీ పెద్దమ్మాయి రాజకీయవాదండీ. నీతులు ఎదుటవారికే."

"మరదలి జీవితాన్ని మీరు వుద్ధరించ కూడదూ?" కసిగా సవాల్ చేసింది. నలుగురిలో తనని గురించి హేళనగా మాట్లాడటం ఆమె సహించలేకపోయింది.

పతంజలి నవ్వుతూ చూశాడు. "పది




వేలు నాకో లెక్క కాదు. అలాగే చేస్తా. 'మాకు సంబంధం లేదని' నీ అన్నలు అంటే."

"మేమంత దగాకోరులమా?" రంగా రావు ఉక్రోషంగా అన్నాడు.

"తెలియదంలా!"

భర్త అక్కడ వుంటే ఎటూ సమస్య జరగదని ప్రమీల గుర్తించింది. "సినిమా కెళ్ళతామన్నారుగా."

"నన్ను వెళ్ళమని చెప్పడం యిది. ఆల్ రైట్ ....సామ్రాజ్యం బలవంతంగా ఒప్పుకోకు. నేనున్నా." పతంజలి వెళ్ళి పోయాడు.

"అన్నదమ్ములే అనలేక పోయారా మాట" సీతమ్మ యాంత్రికంగా అంది.

పతంజలి వెళ్ళిపోవడంతో రంగారావు స్వేచ్ఛగా కూర్చున్నాడు. తల్లి అన్నమాట ఆరిపోతున్న కోపాన్ని రెచ్చగొట్టింది.

"మేం వెధవలమని నువ్వు చెప్ప క్కర్లేదు. డబ్బుంటే మంచి సంబంధం మేమే చూద్దుం."

"బ్యాంకులో ఎనిమిది వేలున్నా యిగా!"

"ఈపదిరోజుల్లో రెండువేలయింది!!"

"మిగులు?"

"చలపతిగార్కి అయిదు వేలు యివ్వా లట చేబదులు. అది యివ్వద్దు మరి? మిగతా దాంతో ఏం పెళ్ళవుతుంది?"

"అంత డబ్బు పుచ్చుకునే అవసరం ఏమొచ్చింది మీ నాన్నకి. తీసుకుంటే నాతో చెప్పరూ?" అనుమానంగా, ఆందో ళనగా చూసింది సీతమ్మ.

"ఆయన పెద్దమనిషి తెల్సా? కక్కుర్తి పడి అబద్ధమాడతాడా? మనం యివ్వనంటే ఏం చెయ్యలేడు. అయినా అది గౌర వమా?"

తనకి అవసరమంటూ తండ్రి సుపేగా శర్మ పట్టుకుపోయాడు. రంగారావు

యింకా పట్టు ఎత్తి ఎశాడు. తనకు అంద నది తనూ జాగ్రత్త పెట్టుకోవాలని.

ప్రమీల మద్దత్తు యిస్తూ "పెద్దన్నయ్య అబద్ధం చెబుతాడా?" అంది.

సీతమ్మ మనస్సు గదిలో ఆవరించిన చీకటిలా వుంది. విచారానికి తోడు సామ్రాజ్యం పెళ్ళి. దానికి అన్యాయం జరిగిపోతోంది. ఆరాటమే కాని తనేం చెయ్యగలదు?

రాత్రి భోజనాల దగ్గర రంగారావు సంబంధాన్ని ఖాయంచేసినట్లే మాట్లా డాడు. సీతమ్మ ఏం తర్కించలేదు.

"ఏమంటావే?" భర్తవచ్చేలోగా ఆమె చేత అవుననిపించాలని ప్రమీల తొందర పడుతోంది.

స్వామ్రాజ్యానికి పంతొమ్మిదేళ్ళుం టాయి. చామన చాయగా పొడుగ్గా వుంటుంది. అందం, ఆకర్షణ సామాన్యం చదువుకూడా అబ్బలేదు. శ్రావ్యంగా కూనిరాగాలు తీస్తుంది. తన భవిష్యత్తుని సమీక్షించుకునే చొరవ తెలివి ఆమెకి లేవు. రెండోపెళ్ళి సంబంధంచేత కాదనా లనిపిస్తోంది. చెప్పడానికి భయం.

పైగా ప్రమీల అధికత్వాని ఆమె గర్హిం చింది. తనపెళ్ళి దానికి చాలా వేళా కోళంగా, ఆటగావుంది. అందరికంటే దీనీ పోరెక్కువయింది.

"నువ్వయితే ఏం చేసేదానివి?" ఎదు రడిగింది.

బురదపడ్డ తెల్లచీరలా వెలవెల పోయింది ప్రమీల.

"గట్టుమీద కూర్చుని ఎన్ని కబు ర్లయినా చెబుతారు" సీతమ్మ విసుగ్గా అంది.

ప్రమీలకి దాంతో కోపం వచ్చేసింది. "మీ యిష్టమొచ్చినట్లు చేసుకోండి" అంటూ వెళ్ళిపోయింది. మర్నాడే ప్రయా ణం కట్టింది. సీతమ్మ ఏం మాట్లాడలేదు.

"ఉత్తరం రాయి సామ్రాజ్యం" అన్నాడు బండెక్కి సామ్రాజ్యంతో పతంజలి.

దానర్థం సామ్రాజ్యానికి తెల్సింది. బావ మంచితనానికి, అన్నల దుర్మార్గానికి ఆ పిల్ల నివ్వెరపోతోంది. ఎవరు సొంత వారో ఎవరు పరాయివారో కూడా తెలి యడం లేదు. ఒకళ్ళు రక్తాన్ని బట్టి దగ్గర ఆత్మీయతకి దూరం. మరొకరు రివర్స్.

పిల్లిని అడిగి గంట కట్టరని రంగా రావు సమాధాన పరుచుకున్నాడు. ఎవరికి కోపాలు వచ్చినా తనకి తోచిందే చెయ్య డానికి నిర్ణయించుకున్నాడు.

"మీరో సంబంధం చూడకూడదూ?" ధనలక్ష్మి సలహా యిచ్చింది. ప్రొద్దుట సామ్రాజ్యం వచ్చి తనదగ్గర బావురు మన గానే ఆమె కరిగిపోయింది.

"నీకూ వచ్చిందీ జబ్బు?"

"ఆడపిల్ల వుసురు మంచిది కాదండీ" ధనలక్ష్మి పాతతరానికి పూర్తిగా ప్రతినిధి. ఆ అలవాట్లు, ఆచారాలు, భయాలు పూర్తిగా అబ్బాయి.

"నోర్మూసుకో" భార్యను గద్దించి పడేశాడు.

రంగారావు మాట యివ్వగానే వెంకట పతి చీర పసుపుకుంకుమ పంపించాడు. పెళ్ళి కుదిరినట్లు గుర్తు. రెండు నెలల్లో

పెళ్ళి జరిగిపోవాలని తీర్మానానికి వచ్చారు.

శిలమీద కురుస్తున్న వానలా నిశ్చలంగా వుంది సీతమ్మ. "నీ రాత ఎలా వుంటే అలా జరుగుతుంది. నేనేడిస్తే లాభం ఏమిటి?"

తల్లి కిష్టంలేదీ పెళ్ళి. తనకీ యిష్టం లేదు. ఎలా తప్పించుకోవాలో సామ్రాజ్యానికి తోచలేదు. అవాంఛనీయాల్ని నిరోధించడానికి అందరూ తిరుగుబాటు చెయ్యలేరు. సామ్రాజ్యం పరిధి చాల తక్కువ. నోర్మూసుకుని పెళ్ళి చేసుకోవడం లేదా యింటినుంచి తాత్కాలికంగానో, శాశ్వతంగానో నిష్క్రమించడం. ఇవేమీ సామ్రాజ్యానికి చేతకావు. ఇవి చెయ్యడానికి మొండిధైర్యం కావాలి. వీటికంటే మంచికో చెడ్డకో పెళ్ళి చేసుకోవడమే మంచిదనిపించింది.

పెళ్ళి గుళ్ళో జరిగిపోయింది. శర్మ రాలేదు. వందరూపాయిలు సామ్రాజ్యానికి యం. ఓ. చేశాడు. ప్రమీల ఒక్కతే ముహూర్తానికి వచ్చి వెళ్ళిపోయింది. పతంజలి బొంబాయి వెళ్ళాడు వ్యాపారం విషయమై.

తను వాళ్ళకి, శాశ్వతంగా దూరమైపోయినట్లు సామ్రాజ్యం బాధపడి కొత్త కాపురానికి వెళ్ళిపోయింది.

బరువు వదలిన శ్రామికుడిలా నిట్టూర్చాడు రంగారావు.

* * *

పెళ్ళి జీవితకాలంలో జరిగే ముఖ్య సంఘటన. జీవితం ఒక మలుపు తిరుగుతుంది. చాలమంది దీన్ని వసంతకాలంతో పోల్చుకుంటారు. కాని కొంతమందకి శిశిరమయి కూర్చుంటుంది. తన గోడుకి విలపించేకంటే ఎదుటవారి గోడుకి బాధపడటం జరుగుతుంది. పెళ్ళయిన రెండో నెల్లో వెంకటపతికి టి. బి. ఎటాక్ అయింది.

వెంకటపతి కూడా ఏకాకి. కావాల్సిన బంధువులు లేకపోయినా దగ్గరి వాళ్లుకూడ ఎన్నడో దూరంగా జరిగిపోయారు.

అన్నిటికీ సామ్రాజ్యమే మిగిలింది. అమాయకంగా తన సేవలకి అంకితమైపోయిన సామ్రాజ్యాన్ని చూసి వెంకటపతి నిట్టూర్పు విడిచాడు. పెళ్ళిద్వారా తను ఈమెని వంచించాడా?

"మా చిన్నన్నయ్య దగ్గరికి వెళదామండి.. డాక్టరు కదా, దగ్గరుండి అన్నీ చూస్తాడు."

భార్య మాట ఒప్పుకున్నాడు. కొన్నాళ్ళయినా యితరత్రా ఎవరయినా వుంటే ఆమెకి ధైర్యంగా వుంటుందనుకున్నాడు.

సుశీల ఆడబిడ్డని సాదరంగానే ఆహ్వానించింది. సుశీల చాల లోతైన మనిషి. ఎప్పుడూ పెదాలమీద చిరునవ్వుంటుంది. దీనివల్ల చాలమంది ఆమెని 'మంచిది' అంటూ అపార్థం చేసుకుంటారు. తన అయిష్టాన్ని కూడ ఎంతో తియ్యగా జరుపుతుంది.

"ఆయనకి క్షయ వదినా."

మకాం ఔట్ హౌస్‌కి మార్చివేసింది వెంటనే. ఇది అంటురోగమని చాలా జాగ్రత్తగా వుండాలని చెప్పింది. సామ్రాజ్యం తను గౌరవాలు కోసం రాలేదని తన పనిమీద వచ్చిందని గుర్తు చేసు

పంది. చిన్నన్న యిచ్చే మందులు కోసం అక్కడ పడివుంది. శర్మ ఆప్యాయత చూపలేక పోయినా, వెళ్ళిపొమ్మని మాత్రం చెప్పలేదు.

"ఇదెక్కడి పీడండీ ...ఏ మదనపల్లో తీసుకు పొమ్మనండి. వాడి దగ్గుర క్తాన్ని చూసి పిల్లలు హడలిపోతున్నారు" భర్తకు కీ యిచ్చింది సుశీల.

రోగం ముదిరిపోయింది. శానిటోరియంలో చేర్పించాలని చెప్పాడు.

"నాకేం తెలుస్తుందిరా .. నువ్వొచ్చి చెప్పండే."

"నాకెక్కడ ఖాళీయే.... పెద్దన్నయ్య దగ్గరకెళ్ళు."

ఏదో అనబోతున్న సామ్రాజ్యాన్ని వారించాడు వెంకటపతి. తక్షణమే రంగారావు దగ్గరికి పయనమయ్యారు.

సీతమ్మ ఘొల్లుమంది. తల్లిని చూపి తనూ ఏడ్చింది సామ్రాజ్యం.

"మీరు ధైర్యంగా లేకపోతే ఎలా?" పార్వతి యిద్దర్నీ ఓదార్చింది.

చెల్లెలు చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు రంగారావు. మళ్ళీ ఖర్చు తగిలిందని గాబరాపడి "డబ్బు చూడ్డానికి ఆలస్యమవుతుంది" అన్నాడు.

"డబ్బు నా దగ్గరుందిరా....మదనపల్లి తీసుకెళ్ళు."

మధ్యాహ్నం కారులో ప్రమీల వచ్చింది, మర్నాడు కొడుకు పుట్టిన రోజుకి పిలవడానికి. సామ్రాజ్యంపై ఒక్క సానుభూతి వాక్యం కూడా అనలేదు.

"నీ కర్మ అలా వుంది మరి...."

ఆ రోగిష్టి వాతావరణంలో ఆమె అట్టేసేపు వుండలేకపోయింది. వెంటనే ప్రయాణమై తల్లిని "బయలుదేరు!" అంది.

"నే నెక్కడికే? సామ్రాజ్యంతో వెళతున్నాను."

ప్రమీల అసహనంగా చూసింది. ప్రక్క వసారాలో వాళ్ళున్నారని తెల్సి కూడ "అది అంటుజబ్బు తెల్సా ...దగ్గరుంటే అంటుకుంటుంది. పెళ్ళాం కనుక దానికి తప్పదు" అంది.

పెద్దకూతుర్ని పురుగులా చూసింది సీతమ్మ "ఛీ నీ స్వార్థం పడ."

"నువ్వు వస్తావా రావా చెప్పు? ఆ రోగిష్టి వాళ్ళతో వెళతానంటే నా అభ్యంతరం ఏమీలేదు. నేను మాత్రం తిరిగి గుమ్మం ఎక్కను" వస్తున్న సామ్రాజ్యాన్ని చూసి ఆగిపోయింది.

"ఆయన పిలుస్తున్నారమ్మా . నెమ్మదిగా అంది.

వెంకటపతి ఆయాసంగా మంచంమీద కూర్చున్నాడు. సీతమ్మ తలుపులు దగ్గర నిలబడింది.

"మాతో రావద్దు మీరు" ఆయాసంగా అన్నాడు.

"అదేమిటి బాబూ, చిన్న పిల్లొక్కతే ఏముంటుంది?"

"మీరు వస్తే . . నేను వెళ్ళను కళ్ళలో జీర కనిపించింది వెంకటపతిలో తమ సంభాషణ వినపడిందని తల్లడిల్లిపోయింది సీతమ్మ.

శానిటోరియంలో జేర్పించి వచ్చేశాడు రంగారావు.




"మళ్ళీ వస్తావుకదరా అన్నయ్యా!" నీళ్ళ కళ్ళతో ఆశగా అడిగింది సామ్రాజ్యం.

"వీలువిబట్టి."

వీలయిన రంగారావు మళ్ళీ వెళ్ళలేదు. ఉత్తరమయినా వ్రాయలేదు. సీతమ్మే కోడలిచేత రాయించేది.

పతంజలి మాత్రం ఒకసారి వచ్చాడు. ఎడారిలో జలాశయం చూసి నట్లుంది సామ్రాజ్యానికి. సంతోషం కన్నీటిలోకి మారిపోయింది.

"పిచ్చిపిల్లా . ఏడ్వకూడదు. డాక్టర్ని అడిగాను కదా. ఫర్వాలేదన్నారు, నెమ్మదిగా తగ్గిపోతుంది."

"అంత అదృష్టమా బావా?"

పతంజలి ధైర్యం చెప్పాడు. "నువ్వు భయపడుతూంటే చెప్పు. మా గుమస్తాని పంపిస్తాను. సాయంగా వుంటాడు. మీ అక్క ఎలాగూ రాదు కదా!"

"వద్దులే బావా..అవసరమైతే రాస్తాను"

ఆ మంచితనానికి సామ్రాజ్యం అబ్బుర పడిపోయింది.

వెళ్ళిపోతూ వెయ్యిరూపాయలు యిచ్చాడు. సామ్రాజ్యం వద్దన్నా వినలేదు. "తీర్చివేద్దువుగానిలే .అవసరమైతే వైరియ్యి."

పతంజలి వెళ్ళిపోయాకా వెంకటపతి అన్నాడు. "వచ్చింది ఎవరు?"

"మా బావ."

"కాదు. అన్నయ్య."

* * *

వెంకటపతి అనారోగ్యం వైద్యానికి లొంగలేదు. అస్థిపంజరంలా అయిపోయాడు. ఊపిరితిత్తులు రెండూ పాడై

పోయినాయి. డాక్టర్లు పెదవి విరిచారు. సామ్రాజ్యం భయపడుతూ అందరికీ టెలిగ్రాం యిచ్చింది. సీతమ్మ, పతంజలి వచ్చారు. అప్పటికే వెంకటపతి యిహ జీవితాన్ని ముగించాడు.

"నా రాతే పట్టిందే .." సీతమ్మ ఘొల్లుమంది.

చూడవల్సిన వ్యవహారాలన్నీ పతంజలి చూశాడు. ఈసారయినా తోబుట్టువులు వస్తారని తనకి వూరట కల్గిస్తారని సామ్రాజ్యం ఎదురుచూసింది. కాని నిరాశపడక తప్పలేదు. వాళ్ళురారని సీతమ్మకు తెలుసు. సామ్రాజ్యంతో ఏం చెప్పలేదు.

"మా ఇంటికి తీసుకుపో బావా."

పతంజలి అర్థం కానట్లు చూశాడు.

"నేను వెంకటపతిగారి భార్యనికదా!"

సీతమ్మ జోక్యం చేసుకుంటూ "అక్కడెవరున్నారే? కర్మకాండలు చెయ్యాలి. వంటరిగా ఎలా వుంటావ్?" అంది.

"నా బాధ ఏదో పదుల్చుకున్నారు కదా . యింకా ఎందుకులే వార్ని బాధించిడం?" విషాదంతో ఆమె గొంతుక వణికింది.

ఆమె మాటలు యదార్థమైనా సీతమ్మ ఒప్పుకోలేదు. ఆడది. ఎంత కాదన్నా కావల్సినవారి అండన వుండాలి. పాత తరం మనస్తత్వంతో సీతమ్మ అంగీకరించలేకపోయింది.

"వాళ్ళవల్ల భయమైతే నువ్వెళ్ళిపో" సామ్రాజ్యం కరకుగా అంది.

సీతమ్మ అల్లుడికేసి చూపి "దీనికి మతిపోలేదుకదా నాయనా" అంది.

"సామ్రాజ్యం చెప్పింది బాగానే వుంది."

పతంజలి తనని బలపరిచినందుకు సామ్రాజ్యం సంతోషించింది.

రెండువారాలు గడిచాయి. వెంకటపతి రోజులు తీరాయి. పతంజలి అవన్నీ చూశాకా ప్రయాణమయ్యాడు.

"ఉత్తరాలు రాస్తూండు సామ్రాజ్యం. అవసరమైతే వస్తాను."

"అలాగే బావా. నీకంటె ఎవరున్నారు కనుక?"

"జరిగినది మరచిపోవాలి. గతాన్నే ఆలోచిస్తూ కూర్చుంటే బ్రతుకు దుర్భరమవుతుంది. ఏదో వ్యాపకం కల్పించుకుని రోజులు కొత్తగా గడపాలి."

వెంకటపతి యిన్సూరెన్సు డబ్బు పాతికవేలు, పి. యఫ్. ఎనిమిదివేలు వచ్చాయి. సామ్రాజ్యం వాటిని బ్యాంక్‌లో వేసింది. ట్యుటోరియల్ కాలేజీలో చేరింది. చదువులోనయినా మునిగి కాలం గడుపుదామని. సీతమ్మని రమ్మని రంగారావు ఉత్తరాలు గుప్పిస్తున్నాడు.

"వెళ్ళరా . నే నుండగలను లే" అని సీతమ్మని పంపించింది.

ఆ యేడు రైతులు శిస్తు ఎగనామం పెట్టారు. పండలేదని బొంకారు. సామ్రాజ్యం ఉత్తరం రాసి పతంజలిని రప్పించింది.

"ఆడదానివని వాళ్ళకి లోకువ సామ్రాజ్యం. ఏటా యిలా వీళ్ళతో బాధలు పడగలవా?"

"మరేం చేద్దాం.... కేసు పెడదామా?"




పతంజలి నవ్వాడు. "నీకు లోకజ్ఞానం లేదు మరదలా. సివిల్ దావాల్లో ఓడిన వాడు ఏడుస్తూ యింటికి వస్తాడు. నెగ్గిన వాడు యింటికొచ్చాక ఏడుస్తాడు. అంచేత అమ్మేసి రూపాయిలు దగ్గరుంచుకో."

సామ్రాజ్యం అంగీకరించింది. రైతులు అమ్మడానికి వీల్లేదని ఎదురుపేచీ లేవదియ్య బోయారు. పతంజలి చాకచక్యంగా ముప్పై ఆరువేలకి అమ్మకం జరిపాడు. రిజస్ట్రేషన్ కూడ అయిపోయింది.

సామ్రాజ్యాన్ని ఇంతకుముందు కాలం భయపెట్టేది. డబ్బు చేరగానే ఒక విశ్వాసం, నిబ్బరం కలిగాయి. దేన్నయినా జయించే సాహసం కల్గింది.

ఒకసారి వచ్చివెళ్ళమని రంగారావు దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. ఏమిటీ వింత? సామ్రాజ్యం విడ్డూర పడి పోయింది. శర్మ దగ్గర్నుంచి, ప్రమీల దగ్గర్నుంచికూడ ఉత్తరాలు వస్తున్నాయి. సామ్రాజ్యం వేటినీ లక్ష్యపెట్టలేదు.

చదువుమీద యింట్రెస్టు కలగలేదు. బలవంతంగా చదివినా బుర్రకెక్కడం లేదు. మానేసింది. మహిళామండలిలో టైలరింగ్ నేర్చుకుంది కొన్నాళ్ళు. సినిమాలు, పుస్తకాలతో రోజులు వెళ్ళిపోతున్నాయి. కాని సామ్రాజ్యానికి ఉషారుగా లేదు.

ముప్ఫయివేలు పెట్టి సబ్బుల కంపెనీలో మేనేజింగ్ పార్టనర్‌గా చేరింది. ఆ కంపెనీ పెట్టి ఆర్నెళ్ళయింది. బాగానే నడుస్తోంది. సామ్రాజ్యానికి చేతినిండా పని దొరికింది. కాలక్షేపం బాగానే వుంది.

ఇంతలో సీతమ్మ పోయిందని ఉత్తరం వచ్చింది. సామ్రాజ్యానికి కన్నీరు ఆగ లేదు. జీవితమంతా ఏడ్పేలాగే జరుగుతోందని వాపోయింది.

"అరె....ఏం జరిగింది?" మురళీధరం దగ్గరకి వచ్చాడు. సామ్రాజ్యం మాట్లాడ

లేదు. మురళీధరం ఉత్తరం చదివి ఓదార్చాడు.

"ఇవన్నీ మన జీవితాన్ని శాపించే సంఘటనలు. ఏం చేయలేం. మీరు ధైర్యంగా వుండాలి." మురళీధరం రైలెక్కుస్తూ అన్నాడు.

"మీరు శ్రమ తీసుకున్నారు..." సామ్రాజ్యం నొచ్చుకుంటూ అంది. తనని ఓదార్చడంతో తను ఏకాకి కాదని సామ్రాజ్యం సంతోషించింది.

"విత్ ప్లెజర్.... సాధ్యమైనంత తొందరగా రండి."

రైలు బయలుదేరింది కూతవేసి.

రంగారావు, శర్మ విలువైన అతిధిలా చూశారు సామ్రాజ్యాన్ని. ప్రమీల సరే సరి. సామ్రాజ్యం నివ్వెరపోయింది. ఛీ అనిపించుకున్నచోట ..శభాషా? ఈ కీర్తి తను బలిదానం చేసుకున్నాక వచ్చింది. మెరుగుల్నిబట్టి విలువలు మారతాయి. తనకి సేవలు చెయ్యడానికి రంగారావు, శర్మ పోటీ పడుతున్నారు.

"వ్యాపారం పడిపోయిందమ్మా. ఇరవై వేలుంటేగాని పైకి రావడానికి కుదరదు. నువ్వు కాదనవనే అడుగుతున్నాను" రంగారావు ప్రాధేయపడ్డాడు.

"కొత్తగా యిల్లు కట్టాను. పాతికవేలు అప్పయింది. అనవసరంగా వడ్డీ యిస్తున్నాను. నువ్వు సాయం చేస్తే...." శర్మ అడిగాడు.

వాళ్ళని చూస్తే అసహ్యం వేసింది సామ్రాజ్యానికి. తన జీవితాన్ని అన్యాయం చెయ్యడానికి వెనుకాడలేదు. పోనీ, తను మనుషులకోసం కళ్లుపెట్టి చూస్తున్నప్పుడు ఒక్కరి సాయమూ లేదు. ఈనాడు తను ముఖ్యురాలైంది, డబ్బునిబట్టి.

"మా వాడ్ని దత్తత చేస్కో" ప్రమీల ఆశగా అడిగింది.

"నాకు పిల్లలుండరనా?"

ముగ్గురూ విస్తుపోయారు.

"అన్యాయం చేశాను సామ్రాజ్యం .. కాని, నీ జీవితం నావల్ల మోడువారిపోకూడదు. ఒక జీవితకాలం మన స్వొంతం. సూత్రాలకి భయపడి జీవితాన్ని వైరాగ్యంతో గడపకు. మళ్ళీ పెళ్ళి చేస్కో ..." వెంకటపతి ఆఖరి మాటలు గుర్తు వచ్చాయి.

"పెళ్లిచేసుకుంటున్నా ...నా కుటుంబం కోసం."

"విధవా వివాహమా? ఎవరా చవట?" రంగారావు పళ్ళు కొరికాడు.

"మీరు నాకేం చెయ్యలేకపోయారు. నేను మీకేం చెయ్యను. నా పరిధిలో మిమ్మల్ని తొలగించాను. ఒక కొత్త వ్యక్తికి చోటిచ్చాను. అతడు మురళీధరం."

వెంటనే బయలుదేరింది సామ్రాజ్యం.



ఎల్లెడలా విద్యుత్ దీపాలు వెలుగుతూండటంచేత దృశ్యాలన్నీ స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఒకచోట - చిన్న పాకలాంటి ప్రదేశంలో యింటికి కూలిపని చేసుకుని వచ్చిన భర్తకు - యిల్లాలు వీపు రుద్ది నీళ్ళు పోస్తోంది. అతను నవ్వుతూ ఏదో కబుర్లు చెబుతున్నాడు.

మరోచోట రోడ్డుప్రక్క రిక్షా ఆగివుంది. కాళ్ళు పెట్టుకునేచోట రిక్షావాడు కూర్చుని వుండగా, అతని పెళ్ళాం ప్రేమగా కబుర్లు చెబుతూ సత్తు క్యారియర్‌లోని అన్నం తినిపిస్తోంది.

---

జరిగిన కథ :

సునీతికి చిన్నతనం నుంచీ సాహసకృత్యాలంటే ఇష్టం. హఠాత్తుగా యాక్సిడెంట్‌లో సునీతి తండ్రి చనిపోయాడు. తల్లితోసహా పెదనాన్న పంచన చేరింది సునీతి. సునీతి తల్లి ఆ ఇంట్లో పనిమనిషిలా చూడబడుతోంది. సునీతి తల్లి తనను బలవంతం చేయబోయిన బావ బారినుండి తప్పించుకొనే ప్రయత్నంలో అతని ప్రాణం పోయింది. జైల్లోనే జబ్బుచేసి మరణించిందామె. సునీతిని నారాయణమ్మ ఆదరించింది. పొరుగింటి కృష్ణమూర్తి దంపతులు సునీతిని సర్కస్ చూపిస్తామని తీసికెళ్ళారు. దారిలో కాఫీ త్రాగిన తర్వాత సునీతికి కళ్ళు తిరిగినట్లనిపించింది. సునీతిని మోసంచేసి తీసుకుపోయి, ఆమెను అనుభవించ ప్రయత్నించాడు కృష్ణమూర్తి. కృష్ణమూర్తి బారినుంచి తప్పించుకొని పారిపోతున్న సునీతిని ఆదుకొన్నారు రాజారావుగారు; పిల్లల్లేని రాజారావుగారు సునీతిని దగ్గరుంచుకొని చదివిస్తున్నారు. సునీతి కాలేజి చదువులో ప్రవేశించింది. రాజారావుగారికి వేరే మరో భార్యా, సంసారం ఉన్నదన్న విషయం తెలిసి ఆయనంటే అసహ్యం కలిగింది సునీతికి. కాని రాజారావు ఏ పరిస్థితులలో తాను అలా చేయవలసి వచ్చిందో చెప్పినప్పుడు ఆయనలోని మంచితనం తెలిసొచ్చింది సునీతికి.

---

నాన్నగారు నిట్టూర్పు విడిచి బరువైన కంఠంతో అన్నారు. "నాగరికత అనుకుంటాం. వ్యక్తిత్వం అని పేర్లు పెట్టుకుంటాం. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అని నినాదాలు చేస్తాం. కాని అనుక్షణం కుటుంబాల్లో అశాంతితో అలమటిస్తూ వుంటాం. అక్కడ అనాగరికం వుండనీ, అవిద్య వుండనీ, అప్పుడప్పుడు దౌర్జన్యం చోటు చేసుకోనీ - సుఖశాంతులు కూడా మనకంటే ఎక్కువే వుంటాయమ్మా."

ఆయన చెప్పిన మాటల్లో నిజానిజాలను గురించి ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాను.

# 7

మద్రాస్‌లో భారత-వెస్టిండీస్ దేశాలమధ్య నాలుగవ క్రికెట్ టెస్ట్ జరుగుతోంది. మొదటి రెండు టెస్టుల్లోనూ వెస్ట్‌యిండీస్ భారతదేశాన్ని ఓడించింది. మన వాళ్ళ ప్రతిభను గురించి అందరూ చప్పరించి పారేస్తోన్న సమయంలో కలకత్తా టెస్ట్‌లో భారతదేశం వెస్టిండీస్‌ని ఓడించెయ్యటంతో పోయిన వుత్సాహం అందరికీ తిరిగి వచ్చింది.

నాకు మొదట్నుంచీ క్రికెట్ అంటే క్రేజ్. మ్యాచ్ జరుగుతోన్న ఆ అయిదు రోజులూ రన్నింగ్ కామెంటరీ వినటానికి రేడియోకి అంటుకుపోయి వుండేదాన్ని కాలేజికి వెళ్ళవలసి వస్తే పాకెట్ రేడియో తీసుకెళ్ళి ఓమూల కూర్చుని చెవిదగ్గర పెట్టుకుని వింటుండేదాన్ని.

'స్కోరెంత స్కోరెంత?' అందరూ యిదే ప్రశ్న.

ఉషకు నవాబ్ ఆఫ్ పటౌడీ అంటే తెగని పిచ్చి. అందుకని కొందరు దాన్ని షర్మిలాఠాకూర్ అని ఏడిపించేవాళ్ళు.

నాకుమాత్రం క్లైవ్‌లాయిడ్‌ని చూడాలనుంది. నా మనోనేత్రం ముందు ఆతను వీరోచితంగా కనబడతాడు.

జ్యోతికి క్రికెట్ అంటే అంత క్రేజ్‌లేదుగాని, మేమిద్దరం బయల్దేరితే తనూ రావటానికి ఒప్పుకుంది.

నేను నాన్నగార్ని మద్రాస్ వెళ్ళటానికి అనుమతి అడిగాను.

నవ్వి సరేనన్నారు.

జ్యోతి, ఉష కూడా వాళ్ళ పెద్దవాళ్ళకు చెప్పి అంగీకారాలు తీసుకున్నారు.

నాన్నగారు ముందుగానే లోకల్ క్రికెట్ ఎసోసియేషన్ ద్వారా ముగ్గురికీ టిక్కెట్లు తెప్పించారు. ముందుగా ఏర్పాటు చేసుకోకపోతే టికెట్లు దొరకవని మాకు తెలుసు.

హైదరాబాద్ - మద్రాస్ ఎక్స్‌ప్రెస్‌లో బయల్దేరాం. ఒక్కళ్ళు నిద్రపోతే ఒట్టు. కబుర్లు, నవ్వులు, కేరింతలు, కాసేపు దబ్బేట్టి పేకాడాం. కొంతసేపు చైనీస్ చెకర్స్ ఆడుకున్నాం.

"మన్సూర్ ఆలీఖాన్‌ని చూడాలని మహా తహతహలాడుతోంది. అతన్ని చూస్తేగాని యీవిడగారు నిద్రపోదు. మనల్ని పోనివ్వదు" అంది జ్యోతి ఉషను దెప్పిపొడుస్తూ.

"లాభంలేదు, పటౌడీ నవాబ్‌ను షర్మిలా కొట్టేసింది. ఉషకా ఛాన్స్‌రాదు అన్నాను.

"నేనతన్లోని స్పోర్ట్స్‌మెన్‌ని లైక్‌చేస్తాను. అతన్నికాదు" అంది ఉష ఉక్రోషంగా.




"పటౌడీ యిప్పుడు బాగా ఆడలేకపోతున్నాడు. గట్టిగా యీమధ్య పాతిక రన్లు-ఎప్పుడు తీశాడు చెప్పండి. వాడేకర్ రిటైర్ కాబోతే మళ్ళీ ఫీల్డులోకి వచ్చేవాడే కాదు" అన్నాను.

"ఫారంలో లేకపోతే ఎవరేంచేస్తారు? ఈసారి సెంచరీ కొట్టకపోతే అడగండి."

"పందెమా?"

"పందెం. కొడతాడని."

"ఇంపాజిబుల్. అతనితరం కాదు. పందెం!"

"ఇలా అదీ, నేనూ కాసేపు పోట్లాడుకుని పందేలు కాసుకున్నాం."

*   *   *

క్రికెట్ స్టేడియంకి కనీసం గంటముందుగా బయల్దేరబోతే టాక్సీలు దొరకటం. సీట్లు వెదుక్కోవటం కష్టం. మధ్యాహ్నం లంచ్‌కి అంతమంది జనంలో ప్యాకెట్లూ అవీ దొరకటం కష్టమని మేము దిగిన హోటలువాళ్ళు చెప్పారు. అందుకని ఓ బ్యాస్కెట్‌లో సాంబారన్నం, పెరుగన్నం ప్యాకెట్లు, సాండ్ విచెస్, ఫ్లాస్కునిండా కాఫీ - పిక్‌నిక్‌కు బయల్దేరినట్లు బయల్దేరాం - అట్టహాసంగా. బ్యాస్కెట్ బరువుకు చేతులు నొప్పి పెడుతూంటే టాక్సీ దిగాక స్టేడియం గ్రౌండ్‌వరకూ తలా కాసేపూ మోశాం.

ఎక్కడ చూసినా జనం తీర్థ ప్రజలా వున్నారు. ఎక్కడ పడితే అక్కడ పోలీసులు నిలబడి జనాన్ని అదుపులో వుంచుతున్నారు. ఏస్టాండ్ కాస్టాండ్ విభజించబడి వాటి క్యూలు ఫర్లాంగులకొద్దీ వ్యాపించి వున్నాయి. మొత్తంమీద ఎలాగైతేనేం

నడిచి నడిచి మా స్టాండ్ కి చేరుకుని నంబర్లు చూసుకుంటూ సీట్లు కనుక్కున్నాం.

అప్పటికి పది కావస్తోంది. ప్లేయర్స్ నెట్ ప్రాక్టిస్ చేస్తున్నారు. ఉష తను తెచ్చుకున్న బైనాక్యులర్స్‌లోంచి ఆటగాళ్ళను పరిశీలిస్తోంది.

"పటౌడీ కనిపించాడా?" అన్నాను.

"ఇంకా లేదుగాని అతనెవరు? గవాస్కర్‌లా వున్నాడేమిటి? చూడు" అని బైనాక్యులర్స్ నా చేతికిచ్చింది.

నేను బైనాక్యులర్స్‌లోంచి చూసి "అవును. అలానే వున్నాడు. మ్యాచ్‌లో ఆడటం లేదుగా. ఊరికినే వచ్చివుంటాడు" అన్నాను.

ఇంతకీ అతను గవాస్కరో కాదో మా కిద్దరికీ తేలలేదు. ఎందుకంటే వ్రేలికి తగిలిన ఫ్రాక్చర్‌వల్ల మొదటి నాలుగు టెస్టులూ ఆడలేదు. బొంబే టెస్ట్ ఆడితే ఆడవచ్చు.

"అదిగో నీ పటౌడీ" అన్నాను.

"ఏడీ! ఏడీ!!" ఉష, ఆత్రుతగా చూస్తోంది.

"అటుకాదు. ఇటు. ఇటు."

మా ముందు వరసలోకి అయిదారుగురు యువకులు సీట్లు నంబర్లు చూసుకుంటూ నడిచివస్తున్నారు. అందులో ముందు నడుస్తోన్న అతను యించుమించు పటౌడీ పోలికలతో వున్నాడు.

"ఛీ. పో." అంది ఉష. అన్నదేగాని అతన్ని మార్చి మార్చి చూడకుండా వుండలేకపోవటం నేను గమనించకపోలేదు.

వాళ్ళంతా వచ్చి ముందు వరుసలో సరిగ్గా మా సీట్లకి ముందే కూర్చున్నారు.

కాలేజి స్టూడెంట్లలా లేరు. అప్పుడే జీవితంలోకి అడుగుపెట్టిన వుత్సాహం వాళ్ళలో తొంగిచూస్తోంది. అల్లరి బాగానే చేస్తున్నారు.

మ్యాచ్ మొదలవుతోంది.

మొదట కెప్టెన్లిద్దరూ—అంటే లాయిడ్, పటౌడీ రంగప్రవేశం చేశారు. జనం చప్పట్లు కొడుతున్నారు. టాస్‌వేశారు. పటౌడీ టాస్ గెలిచాడు.

కరతాళ ధ్వనులమధ్య మళ్ళీ ఇద్దరూ తిరిగి వెళ్ళిపోయారు.

అంపైర్లు ప్రవేశిస్తోంటే మళ్ళీ చప్పట్లు.

తర్వాత వెస్టిండీస్ ప్లేయర్లందరూ ఫీల్డులోకి వచ్చేశారు. నాలో వుత్సాహం పొంగిపొర్లుతోంది. క్లైవ్ లాయిడ్‌ని బైనాక్యులర్స్‌లోంచి చూస్తున్నాను.

ఇండియన్ ఓపెనింగ్ బ్యాట్స్‌మెన్ రంగంలోకి దిగారు. ఇంజనీర్, సోల్కార్.

ఇంజనీర్ అంటే ప్రజలకి చాలా ఇష్టం. అతనికున్న గ్లామర్ అతనికుంది. చాలా ఫాస్ట్ స్కోరింగ్. ఎన్నోసార్లు భారతదేశాన్ని ఆపద సమయాల్లో ఆదుకున్నారు.

రాబర్ట్స్ బౌలింగ్ మొదలుపెట్టాడు.

బాప్‌రే! ఏమి ఫాస్ట్ బౌలింగ్! బంతి కంటికి కనబడటంలేదు.

ఇండియాకి ప్రపంచవ్యాప్తి పొందిన స్పిన్నర్లతోబాటు ఫాస్ట్ బౌలింగ్‌కూడా వుంటే ఎంత ముందుండేవాళ్ళమో అనిపించింది.

మొదట రెండు వికెట్లూ గబగబ పడిపోయాయి. మూడో వికెట్ కూడా పడిపోయింది. చాలామంది ట్రాన్సిస్టర్లు చెవులదగ్గర పెట్టుకుని వింటున్నారు. విశ్వనాధ్ వచ్చాడు. ఆశలన్నీ అతనిమీద పెట్టుకున్నారు.

ఇంతలో లంచ్‌టైమ్ అయింది.

గొప్ప కోలాహలంగా వుంది. పావుగంట ముందునుంచీ లేచి నిలబడి బయటకు వెళ్ళేవారు. ఆ తర్వాత ఖాళీ వుండదని ముందే బయటకు వెళ్ళి ఫలహారాలు ముగించుకుని లోపలకు వచ్చేవారు. అల్లరి చేసేవాళ్ళు, ట్రంపెట్లు మ్రోగించేవాళ్ళు ..."

మా ముందు కూర్చున్నవాళ్ళు కూడా లేచారు. సరిగ్గా నా ముందుసీట్లో కూర్చున్నతను ఉంగరాల జుట్టుతో ఎర్రగా, లేతగా వున్నాడు. కళ్ళు నిరంతరం అటూయిటూ కదుల్తూ, మిలమిలలాడుతున్నాయి.

అప్రయత్నంగా అతనివంక చూసి, మళ్ళీ చూడాలనిపించి చూపులు త్రిప్పుకోకపోయేసరికి అతనూ నా ముఖంలోకి చూసి, చూపులు త్రిప్పుకోకుండా అలా వుండిపోయాడు. ముఖం ప్రక్కకి త్రిప్పుకుందామా అనుకున్నాను. ఎందుకు ఓడిపోవాలనిపించి అలాగే చూస్తున్నాను.

"పదరా, తర్వాత చూద్దువుగాని. ఇంకా నాలుగురోజుల టైముంది" వెనకనుంచి సూదో పటాడీ గొంతు కాబోలు అతన్ని హెచ్చరించింది. ఉలికిపడి ముఖం త్రిప్పుకుని గబగబ నడిచివెళ్ళాడు.

మేము ముగ్గురం బ్యాస్కెట్ తెరిచి తినుబండారాలన్నీ బయటకు తీసి కబుర్లు చెప్పుకుంటూ తినసాగాం, బయటకు వెళ్ళేవాళ్ళు వెడుతున్నారు. కాని చాలామంది మాలాగే చేస్తున్నారు.

పావుగంటలో మేము 'లంచ్' తీసుకోవటం పూర్తయిపోయింది. నాకేమీ తోచలేదు. బయటకు వెళ్ళివద్దామన్నాను.

"అమ్మో! ఆ రష్‌లో బయటకు యెవరు వెడతారు? మేము రాము..." అన్నారు వాళ్ళు.

"సరే నే వెడతాను" అని లేచి నిలబడి క్రమెట్లు దిగి క్రిందకు వచ్చాను.

జనం ఎక్కడ పడితే అక్కడ గుంపులు గుంపులుగా వున్నారు. లంచ్ పేకట్లు అమ్మే స్టాల్స్‌లో మరీ రష్‌గా వుంది. కాఫీస్టాల్స్, టీస్టాల్స్, ఐస్‌క్రీం, కోకాకోలా అమ్మే స్టాల్స్ ఎక్కడ పడితే అక్కడ వున్నాయి. ఓ ఐస్‌క్రీం కొనుక్కుని తింటూ మనుషులందర్నీ ఆసక్తితో గమనిస్తూ ముందుకు నడుస్తున్నాను.

దారి మరీ యిరుగ్గా వుండి ఒకళ్ళనొకళ్ళు త్రోసేసుకుంటున్నారు.

"అదిగోరోయ్ మీ చూపుల సుందరి."

అప్రయత్నంగా ప్రక్కకి చూశాను. వాళ్ళయిదుగురూ ఓ మూల నిలబడి లంచ్ ప్యాకెట్లు విప్పుకుని తింటూ నావంక చూస్తున్నారు.

"ఒక్కతే బయటికి వచ్చిందే. చాలా డాషింగ్ గరల్‌లా వుంది."

నేను చూసేసరికి ముఖాలు ప్రక్కకి తిప్పుకున్నారు.

నవ్వుకుని, ముందుకెళ్ళాను.

తిరిగివచ్చేసరికి మళ్ళీ ఆట మొదలుపెడుతున్నారు. క్యూలో ఒక్కొక్క అడుగూ వేసుకుంటూ నా సీటు చేరుకునేసరికి బోలెడు టైం పట్టింది.

బ్యాటింగ్ మొదలుపెట్టారు.

విశ్వనాథ్ బ్రహ్మాండంగా ఆడుతున్నాడు. బౌండరీ కొట్టేసరికి జనం పెద్ద ఎత్తున గోలచేస్తూ లేచి నిలబడి బంతి బౌండరీలైన్ క్రాస్ చెయ్యటం ఆసక్తిగా తిలకిస్తున్నారు.

పటౌడీ—పాపం ఎక్కువ పరుగులు చెయ్యకుండానే అవుటయిపోయాడు. ఉష ముఖం మాడిపోయింది.

"ఏదే! సెంచరీ కొడతాడన్నావుగా" అన్నాను.

"ఫారంలో లేడు" గొణిగింది.

"షర్మిలాఠాకూర్ కూడా యిక్కడనే ఎక్కడో కూర్చుని వుంటుంది. తన ముఖం కూడా మాడిపోయి వుంటుంది" అన్నది జ్యోతి.

ముందు కూర్చున్నవాళ్ళు అంపైర్ డెసిషన్ గురించి చర్చించుకుంటున్నారు.

అభినవ పటౌడీ "ఆ నిర్ణయం తప్పు. అనవసరంగా అవుటిచ్చారు. అన్యాయం" అంటున్నాడు.

"ఆకారంలోనే కాదు. అభిరుచిలో కూడా యితను పటౌడీ శిష్యుడులాగే వున్నాడే" అంది జ్యోతి.

"సెకండ్ యిన్నింగ్స్‌లో విజృంభిస్తాడు చూడు" అంది ఉష.

విశ్వనాథ్ మాత్రం అద్భుతంగా ఆడేస్తున్నాడు. జనాన్ని మెస్మరైజ్ చేసి పారేస్తున్నాడు. బెయిల్ ఎండర్స్‌ని అడ్డం పెట్టుకుని పరుగులు సాధిస్తున్నాడు. ఆఖరికి బేడీ పార్టనర్‌షిప్‌లో కూడా యాభయి పరుగులు ముందుకు తీసుకెళ్ళాడు. నూటపాతిక లోపు అవుటయిపోతారనుకున్న ఇండియన్స్ నూటతొంభయి పరుగులకి ఆల్ అవుటయ్యారు. . జతగాడు లేకపోవటంవల్ల విశ్వనాథ్‌కి సెంచరీచేసే అవకాశం ఏడెనిమిది పరుగుల తేడాతో పోయింది.

మొదటిరోజు ఆట ఆఖరయేసరికి వెస్టిండీస్‌కూడా ముప్పయి పరుగుల చిల్లరకు మూడు వికెట్లు పోగొట్టుకుంది.

మరునాడు ...

ఇండియన్ స్పిన్నర్లు ప్రసన్న, బేడీ, చంద్రశేఖర్‌లు విజృంభించారు. ముఖ్యంగా ప్రసన్న.

వెస్టిండీస్‌కూడా నూటతొంభయిరెండు పరుగులకు ఆల్ అవుటయిపోయి ఆట మంచి పాకాన పడింది.

ఈ లోపల ముందువరసలో కూర్చున్నవాళ్ళ పేర్లు కొన్ని మాకు తెలిశాయి. అభినవ పటౌడీ పేరు వినయబాబు. ఉంగరాలజుట్టతనిపేరు, శ్రీకాంత్. మురారి అన్న యింకొకతను ఎక్కువగా జోక్సు కట్‌చేస్తాడు.

పేర్లు బాగానే వున్నాయి.

అలాగే మా పేర్లు కూడా వాళ్ళు తెలుసుకున్నట్లు అర్థమవుతూనే వుంది——వాళ్ల మాట్లాడుకునే పద్ధతినిబట్టి.

సెకెండ్ ఇన్నింగ్స్‌లో ఇండియా బాగానే ఆడింది. విశ్వనాథ్ మొదటి ఇన్నింగ్స్ అంత గొప్పగా బ్యాట్ చెయ్యలేదుగాని నలభయి పరుగులదాకా చేశాడు. ఈసారి గయ క్వాడ్ ఆడుకున్నాడు. పటౌడీ మళ్ళీ ఫెయిలయ్యాడు. జ్యోతి, నేను కలిసి ఉషని ఉడికించాం. గయక్వాడ్ ఎనభయి పరుగులు చేశాక తొందరపడి రన్ అవుట్ అయాడు. అయినా ఫర్వాలేదు. స్కోరు మూడొందలు దాటింది.

మరునాడు విరామం.

సంక్రాంతి పండుగ సందర్భంగా ఆ రోజుకూడా 'రేస్' లున్నాయి. ఆ మరునాడు డర్బీ వుందిగాని క్రికెట్ మ్యాచ్ సందర్భంగా చూడటం పడదు.

నాన్నగారితో హైదరాబాద్‌లో అయిదారుసార్లు రేసులకెళ్ళాను. అందుకని గుర్రాల పేర్లు పాల్గొనే విధానం అన్నీ తెలుసు. అన్నిటికన్న అక్కడి జనం కేకలు, థ్రిల్—ఎక్సయిట్‌మెంట్ అదంతా ఎంతో యిష్టం.

రాత్రి ముగ్గురం కూర్చుని జాక్‌పాట్ సాల్వ్ చేశాం.

* * *

మొదటి రేస్ పూర్తయింది. నేను కట్టిన రాయల్‌ప్రిన్సెస్ విన్ అయింది. అయిదొందల రూపాయలదాకా గెలిచాను. డబ్బు తెచ్చుకుందామని కౌంటర్‌దగ్గరకు రమ్మంటే కాళ్ళు నొప్పులుగా వున్నాయి యిక్కడే కూర్చుంటామని జ్యోతీ, ఉషా రాలేదు. రెండో రేసుకికూడా వాళ్ళ టిక్కెట్లు నన్ను తీసుకురమ్మని డబ్బు ఇచ్చారు.

ఒక్కదాన్నే బయటకు వచ్చాను.

బుక్కీదగ్గర డబ్బుతీసుకుని యివతలకు వస్తోంటే "హలో" అన్న స్వరం వినబడింది,

ఉంగరాల జుట్టతను—అదే శ్రీకాంత్ "గెలిచారా? కంగ్రాట్సు" అంటున్నాడు. అతని చేతిలో రేస్‌బుక్ వుంది.

"థ్యాంక్స్!" అన్నాను.

"నా కిందులో బొత్తిగా అనుభవం లేదండీ. స్నేహితుల బలవంతంమీద వచ్చాను. ఈసారి హేమమాలినిమీద కాయమంటారా?" అంటున్నాడు.

"మీరు బుకీలో కడతారా? కౌంటర్‌లో కడతారా?" అనడిగాను.

"కౌంటర్‌లో అయితే ఎక్కువ డబ్బు కట్టటానికి వీల్లేదుగా. బుకీలోనే కడదాం" అన్నాడు.

నేను రేస్‌బుక్ తీసి ఒకసారి గుర్రాల తీరుతెన్నులను స్టడీ చేశాను.

"ఎవర్‌గ్రీన్‌మీద కట్టండి. జాకీ మార్షల్. గట్టివాడే" అన్నాను.

నేను చెప్పినట్లే ఎవర్‌గ్రీన్‌మీద వందరూపాయలు కట్టివచ్చాడు.

"మీ ఫ్రెండ్స్ ఏరీ?" అన్నాను.

"వాళ్ళకు బయటకు వస్తే కాళ్ళు నొప్పులు పుడతాయట. తర్వాత రేసుకు వస్తామని లోపలే కూర్చున్నారు?"

"మీ ఫ్రెండ్సు కూడా మా వాళ్ళలాగే శరీర ప్రలోభం కలవారన్నమాట."

నా మాటలకతను నవ్వాడు.

"రేస్ ప్రారంభం కావటానికి యింకా టైముంది కదా, రండి. అలా వెళ్ళి కూల్‌డ్రింక్‌గానీ, కాఫీగానీ త్రాగివద్దాం."

ముఖమెత్తి అతని కళ్ళలోకి చూశాను. "పదండి" అన్నాను.

ఇద్దరం అక్కడ్నుంచి కదిలి కాంటీన్ వైపు దారితీశాం.

అక్కడ సెల్ఫ్ సర్వింగ్.

ఏం కావాలో అడిగి కూపన్లు తీసుకుని అతనే యిద్దరికీ కాఫీ తీసుకొచ్చాడు.

టేబిల్‌దగ్గర ఎదురెదురుగా కూర్చున్నాం.

అపరిచితులతో మాట్లాడటం నాకు కొత్త కాదుగాని ఎందుకనో యీ అనుభవం కొత్తగా వుంది.

నిజం చెప్పాలంటే తెలియని ఆనందంగానే వుంది.

"మీరేం చదువుతున్నారు?" అనడిగాడు.

"నేనేదో చదువుతున్నానని ఎందుకనుకుంటున్నారు?"

ఒక్క నిమిషం తికమకపడి, అంతలోనే సర్దుకుని అందమైన చిరునవ్వుతో కప్పి పుచ్చుకున్నాడు.

"మీ ముఖం చూస్తే చదువుకుంటున్నవారిలా వున్నారు కాబట్టి."

"అయితే బోల్తాపడ్డారు. నేను తర్డుఫారం కేండిడేట్‌ని."

"నా కళ్ళలోకి ఒక్క నిమిషం తదేకంగా చూసి తర్డ్‌ఫారం వాళ్ళంటే నాకు చాలా యిష్టం" అన్నాడు.

"మీ యిష్టాయిష్టాలు నే నడగలేదుగా!"

అతనేం చిన్నబుచ్చుకోలేదు. నవ్వేసి మౌనంగా వూరుకున్నాడు.

"మీరేం చేస్తారు?"

"చాలా చిన్న గుమాస్తా పని చేస్తున్నాను."

"అలాగా? జీతం ఎంతట?"

"ఎంత లెండి! ఓ రెండొందలలోపు వుంటుంది?"

"చాల్లెండి. ఈ రోజుల్లో అంతకంటే ఎందుకు?"

కాఫీ త్రాగటం పూర్తి చేసి యిద్దరం క్యాంటిన్‌లోంచి క్రిందకు దిగి వచ్చాం.

రేస్ ప్రారంభం కాబోతున్నట్లుగా బెల్ మ్రోగింది.

"లోపలికి వెడదామా?" అన్నాడు.

"మళ్ళా ఆ కేకల్లోకి, ఉన్మాదంలోకి ఎందుకులెండి? ఇక్కడ టి. వి.లో మూద్దాం."

టి. వి. దగ్గరగా కొద్దిగా మనుషులున్నారు. నేనూ శ్రీకాంత్ ప్రక్కప్రక్కన నిలబడ్డాం.

రేసు మొదలయింది.

ఎవర్‌గ్రీన్ నంబరు ఏడు. సగంమూరం వచ్చేసరికి అది రెండో గుర్రంగా వుంది. దానికి ముందు నెంబరు నాలుగు పరిగిడుతోంది. తలత్రిప్పి శ్రీకాంత్ ముఖం లోకి చూశాను ఆసక్తిగా. ఆతృతతో, ఉత్సాహంతో భంగిమలు మారుస్తున్నాడు.

గుర్రాలు దగ్గరకొచ్చేస్తున్నాయి.

మొదటి రెండూ సమానంగా వున్నాయి. ఏది ముందో, ఏది వెనకో తెలియటం కష్టంగా వుంది.

చివరకు వచ్చేశాయి.

రేసు అయిపోయింది.

ఏది గెలిచిందో అర్ధంకావటంలేదు.

అదే ప్రశ్న అతనూ అడిగాడు.

ఇంతలో స్పీకర్‌లోంచి ఎనౌన్స్‌మెంట్ వచ్చింది. "ఏడు, నాలుగు గుర్రాలు రెండూ ఫోటో ఫినిష్‌కు వచ్చాయనీ రెండు నిమిషాల్లో ఫలితాలు తెలియచెబుదా మనీ...."

అలాగే కాసేపటిలో ప్రకటన వచ్చేసింది.

"ఎవర్‌గ్రీన్ ఫస్ట్."

"కంగ్రాట్యులేషన్స్" అన్నాను.

"థ్యాంక్స్!"

"పదండి. బుకీదగ్గరకు వెళ్ళి డబ్బు తీసుకుందాం."

శ్రీకాంత్‌కు వెయ్యిరూపాయలు వచ్చింది. "మీకు అయిదునెలల జీతం బోనసుగా వచ్చింది" అన్నాను.

"మీ చలవవల్ల" అంటూ నోట్లు జేబులో క్రుక్కుకుంటున్నాడు.

లోపల్నుంచి అతని స్నేహితులు వినయబాబు, మురారి వస్తూ కనిపించారు.

"అదిగో మీ పటౌడీ" అన్నాడు చప్పున. వెంటనే నాలిక కరుచుకున్నాను.

"పటౌడీ ఎవరు?" అన్నాడు తెల్లపోయి. అంతలోనే మా వైపు నడిచివస్తోన్న అతన స్నేహితుల్ని చూసి "ఓహా! వినయ్ గురించా? ఉండండి. వాడికి పెట్టిన నిక్ నేమ్ గురించి చెబుతాను."

"వద్దండి! ప్లీజ్!"

"నిక్ నేం పెట్టినవాళ్ళకు భయం వుండకూడదు.అందులో మీలాంటి వాళ్ళకు

"మీలాంటి వాళ్ళను అంటే... "

వాళ్ళు దగ్గరకు వచ్చేశారు. ఇంకోవైపు నుంచీ జ్యోతి, ఉషావాళ్ళు కూడా వచ్చేశారు.

అతను వాళ్ళ స్నేహితుల్నీ, నేను నా స్నేహితురాళ్ళనీ పరిచయం చేసుకున్నాం.

శ్రీకాంత్‌కి వెయ్యిరూపాయలొచ్చిందన్న సంగతి వాళ్ళకు తెలిసింది.

ఈసారి రేసులో ఏగుర్రం గెలుస్తుందో చెప్పమని అంతే నా వెంట పడ్డారు. "బావుంది నేనేమైనా గాంబ్లర్ అనుకున్నారా? ఏదో తమాషాకి జోశ్యం చెప్పాను ఫలించింది. ఇహ నావల్లకాదు" అన్నాను.

"అంతేలెండి. మాకెందుకు చెబుతారు? శ్రీకాంతుకైతే " అన్నాడు మురారి.

"మీ శ్రీకాంత్ నాకు ఎక్కువేం కాదు. మొదట అడిగింది అతను కాబట్టి "

"అంతే నంటారా? అయితే మొదట నేను బయటకొచ్చినా బాగుండేది."

అలా మాటలతో మిగతా కాలమంతా గడిపేశాం.

* * *

ఆ సాయంత్రం హోటల్ రూంకొచ్చాక ఏమీ తోచలేదు. ముగ్గురం స్నానాలు చేసి బట్టలు మార్చుకున్నాక "అలా బీచికి వెళ్ళివద్దామా?" అన్నాను.

"అమ్మో! నాకు కాళ్ళు నొప్పులు పెడుతున్నాయి" అంది జ్యోతి.

ఉష వద్దామా వద్దా అని ఆలోచిస్తున్నట్లు కనబడింది.

ఇంతలో నా బుర్రలో యింకో యోచన ప్రవేశించింది.

"స్నేక్ పార్కుకి వెడదాం పోనీ. పాములు చూడటానికి చాలా సరదాగా వుంటాయి" అన్నాను.

స్నేక్‌పార్కుకైతే తాను సిద్ధమేనంది ఉష.

జ్యోతి తాను గదిలోనే వుండి విశ్రాంతి తీసుకుంటానంది. పెద్ద అలసి పోయినట్లు.

ఇద్దరం టాక్సీలో బయల్దేరాం.

స్నేక్‌పార్క్‌లో....

అబ్బ! ఎన్నెన్ని రకాల పాములు! ఎంత అందంగా చిత్రవిచిత్రంగా వున్నాయి!

అక్కడవున్న ఓ యింగ్లీషతను ఆ పాముల మధ్య అవలీలగా తిరుగుతున్నాడు. కోటు జేబుల్లో వాటిని కుక్కేసుకుంటున్నాడు. మెడ చుట్టూ వ్రేళ్ళాడేసుకుంటున్నాడు.

"ఓ! స్నేక్ ఛార్మర్" అని పిలిచాను.

"యస్ మేడమ్" అని దగ్గరకు వచ్చాడు.

"ఆ పాముల్నలా ముట్టేసుకుంటున్నావు. అవి నిన్ను కుట్టవా?" అనడిగాను యింగ్లీషులో.

"ఇవన్నీ త్రాచుపాములు కాదు మేడం. చూడ్డానికి అలానే వుంటాయి" అంటూ ఓ పామును చేతిలో పట్టుకుని దాంతో కాసేపు ఆడి పెదాలమీద ముద్దు పెట్టించుకున్నాడు.

అతను చెప్పేదానివల్ల ఆసక్తి కనపర్చకుండా ఉష రకరకాల విభాగాలన్నీ చూసుకుంటూ ప్రక్కకు వెళ్ళిపోయింది.

"వాటికి ఆహారం ఏం వేస్తారు పాలేనా?" అనడిగాను.

"పాములు పాలు త్రాగవు మేడం. కోడిగుడ్లనీ, ఎలకల్నీ కప్పల్నీ తింటాయి?"

నేను చూపిన పాము కథానాయకుడుగా గల సినిమాలన్నీ గుర్తువచ్చాయి. హీరోయిన్ పాటపాడటం, పాము వచ్చి పాలుత్రాగటం, అంతేగాక నాగులచవతి మన వాళ్ళంతా వెళ్ళి పుట్టలో పాలు పొయ్యటం . .

అంతా అబద్ధమేనా? బాధనిపించింది.

"ఇంకోసంగతి మేడం. పాములకు చెవులులేవు. వాటికి వినిపించదు. అది భూమి ద్రవం వనరును బట్టి మనుషుల్నీ, యితర విషయాల్ని గ్రహిస్తాయిగాని శబ్దాన్ని బట్టికాదు."

ఇదికూడా ఆశ్చర్యమనిపించింది. "పాములు పగబడతాయంటారు. నిజమేనా?" అనడిగాను.

అతను నవ్వాడు. "పాముకి పగంటే తెలీదు. కారణం లేకుండా పగలుబట్టే పాము మనిషే. ఈ పామెంత మంచిదో చూడండి" అంటూ హఠాత్తుగా తానింత వరకూ ఆడిస్తోన్న సర్పాన్ని నామెడచుట్టూ వేసేశాడు.

ఒక్కసారిగా భయం ఆవహించినా, చిత్రమైన స్పర్శతో వళ్ళు జలదరించినా మళ్ళీ ధైర్యం తెచ్చుకుని నిగ్రహంగా నిలబడ్డాను. సర్పం నా మెడచుట్టూ వలయంగా తిరుగుతూ మధ్య మధ్య తల ఎత్తుతోంది.

ప్రక్కనుంచి ఏదో కాంతి మెరిసినట్టయింది. తలత్రిప్పి చూసేసరికి శ్రీకాంత్ కెమెరాతో నిలబడి వున్నాడు.

"తర్ఫ్ఫారం! స్నేక్ నెక్‌లెస్‌తో యు ఆర్ వండర్‌ఫుల్."

"గుమాస్తా! నాకు చెప్పకుండా ఫోటో ఎందుకు తీశావ్?"

"కొన్ని పనులు చెయ్యకుండా వుండలేం గనుక."

"గుమాస్తా! నీ మీద నాకు కోపం వచ్చింది."

అతని ముఖంలో కొంచం బాధ కనిపించింది. దగ్గరగా వచ్చి "మిస్ సునీత! నిజంగా కోపం వచ్చిందా?" అన్నాడు.

---

"నాకతన్ని ఏడిపించాలనిపించింది. పాముని తీసి ఆ యింగ్లీషతనికి యిచ్చేసి వాలా" అన్నాను ముందుకు నడుస్తూ.

అతను నా వెంటబడి "అయితే ఏం చేద్దాం?" అన్నాడు నానుస్తూ.

"దేనికి?"

"మీ కోపం పోయే ందుకు."

"ఆ పాముని మీ మెళ్ళో వేసుకోవాలి. అప్పుడు నేను ఫోటో తీస్తాను."

"బాబోయి. నావల్ల కాదు. ఇంకేదన్నా శిక్ష విధించండి. అంతేగాని పాముని నా మెళ్ళో వేశారంటే భయంతో నా గుండె ఆగిపోతుంది."

"ఆగిపోతే నాకేం? విచారం మీ వాళ్ళకు గాని."

"మీ వాళ్ళంటే....?"

"అదే మీ . అదే. గుమాస్తా పెళ్ళానికి."

"గుమాస్తాకి పిల్లనెవరిస్తారు మేడం. ఎంత ప్రయతించినా ఎవరూ చేసుకో లేదు?"

"పోనీ కన్న తలిదండ్రులకు."

"ఎప్పుడో గతించారు."

"పోనీ అక్కచెల్లెళ్ళకు, అన్నతమ్ముళ్ళకు."

"వాళ్ళూ ఎవరూ లేరు మేడం."

ఉన్నట్టుండి ఆగిపోయాను. "అయితే గుమాస్తా. నీకెవరూ లేరా?"

అతని ముఖంలో బాధ లేదు. ఏ భావమూ లేదు. ఏమన్నా వుందేమో నాకర్థం కాలేదు.

"ఉన్నారు. నా ప్రాణంకంటే అత్యంత ఆప్తులు."

"ఎవరు? మీ వినయబాబా?" కుతూహలంగా అడిగాను.

తల అడ్డంగా త్రిప్పాడు.

"ఎవరు?"

"తర్వాత చెబుతాను."

"తర్వాత మనం కలుసుకోకపోతే?"

"మిమ్మల్ని ఒకసారి కలుసుకున్నవాడు మళ్ళీ కలుసుకోకుండా వుండగలడని నేననుకోవటం లేదు."

తలెత్తి అతని ముఖంలోకి చూశాను. ఏదో అనేదాన్నే. ఇంతలో ఉషా వినయబాబూ ఎదురుగా వస్తున్నారు.

ఒక్కోసారి సహజమైన సంఘటనలు అసహజంగా కనిపిస్తాయి. మరోసారి అసహజమైన సంఘటనలు సహజంగా కనిపిస్తాయి.

"వెడదామా" అన్నట్లు చూసుకున్నాం ఒకరివంక.

అంతా అక్కడ్నుండి కదిలాం. (సశేషం)

మహాకవి శ్రీశ్రీ రచనల ప్రత్యేక శీర్షిక



# నవరసాల శ్రీశ్రీ

## వెలుతురు కిరణాలం

"నీ అంతు ఇప్పుడే తేల్చేస్తా" నంటూ,

గురిచూసి గొడ్డలి విసిరాడు గెరిల్లా వీరుడు. ఎదురుగుండా గొడ్డంకి చెట్టు నానుకుని పొంచున్న పోలీసుద్యోగి మోక రించి చూస్తున్నాడు దూసుకు వస్తోంది గొడ్డలి. పోలీసాయన పాముని చూసిన కప్పలాగా నిశ్చలంగా ఉన్నాడు. ఇద్దరికీ మధ్య ముప్ఫయి మీటర్లకన్న ఎక్కువ దూరంలేదు.

గెరిల్లా యోధుడి గొడ్డలి నిమిషాని కైదుమైళ్ళ వేగంతో పోతోంది

ఈ దేశంలో, ఆ మాటకొస్తే ఏ దేశంలోనైనా చాలామంది ధీరులున్నారు. అంతకుమించి అనేక రెట్లమంది పిరికి వాళ్ళూ ఉన్నారు.

వీరుల్ని గురించి పిరికివాళ్ళకి ఆచూకీ ఇచ్చేవాళ్ళూ ఉన్నారు.

వీరుల నెత్తిమీద బహుమతి ధనం ప్రకటించి తమదారిని నిష్కంటకం చేసు కోవచ్చునని భ్రమపడే ప్రభుత్వాలూ ఉన్నాయి.

అయినా, వీరులు ప్రభవిస్తూనే ఉంటారు. ప్రభుత్వాలను పడగొడుతూనే ఉంటారు. అయితే నిత్యమూ జరిగే సంఘ టన కాదు. అనుదినం జరిగేది, ఇలాంటి వీరులు వందల సంఖ్యలో మరణిస్తూ ఉండడం.

ఒక ఉషస్సు పుట్టాలంటే ఎన్నోకోట్ల నక్షత్రాలు చనిపోవాలన్న కవిమాట కవిత్వమేకాదు, యదార్థం కూడా!

వీరుడి గొడ్డలి ఒక సెంటిమీటరు వారలో గురి తప్పింది. చెట్టులో చిక్కు కుంది. పోలీసాయన బతికి బయటపడ్డం దుకు అతనికే ఆశ్చర్యం వేసింది. మళ్ళీ కరచరణాదు లాడుతున్నాయి. క్షణకాలం శవంలాగయిపోయిన అతని శరీరంలో చైతన్యం ప్రవహిస్తోంది

మూసిన కళ్ళు ఒక్కసారి తెరిచి చూశాడు వీరుడు పొదల్లో మాయమవు తున్నాడు.

పోలీస్ ఆఫీసర్ విజిల్ ఊదేడు. రివా ల్వరును సవరించి పొజిషన్‌లోకితెచ్చాడు.

## ఈ నెల వీరరసం

రెండు జీపులలో వచ్చిన పోలీసు దళాలు ఆ ప్రాంతాన్నంతా చుట్టుముట్టాయి. వీరుడికి గత్యంతరంలేదు. దాగడానికి పొదలు లేవు.

పరుగెత్తుతున్న వీరుణ్ణి గురిచూసి ఒక పోలీసు జవాను తుపాకి కాల్చాడు. గుండు గురి తప్పింది గాని వీరుడి తొడల్లోకి దూసుకుపోయింది.

వీరుడు పడిపోయాడు. స్పృహదప్పి మాత్రంకాదు. అతని దగ్గరకు వెళ్ళడానికి అందరూ భయపడుతున్నారు. పోలీస్ ఆఫీసర్ కొంచెం ధైర్యంచేసి అల్లంతదూరం నుంచి వీరుడి రెండవ కాలిమీద రివాల్వరు పేల్చాడు.

వీరుణ్ణి జిల్లా హెడ్‌క్వార్టర్స్‌కి తీసుకుపోయారు. ఒక పోలీసు ఠాణాలో నిర్బంధించారు. తర్వాత అతణ్ని పెట్టిన చిత్రవధల గురించి ఇక్కడ రాయను.

చెప్పేను కాదూ, ఈ జరిగిందంతా మన దేశంలోనే జరిగిందనుకో నక్కర్లేదు. అనుకునేవాళ్ళు అనుకోవడానికి నా అభ్యంతరంలేదు.

పారిపోతూండగా ఒక బందిపోటును కాల్చిచంపడం జరిగిందని కొన్ని పత్రికలూ, పోలీసులు ఆత్మరక్షణార్థం కాల్పులు చెయ్యగా, ఒక దేశద్రోహి మరణించాడని కొన్ని పత్రికలూ ప్రకటించాయి.

వీరుడింకా బ్రతికే ఉన్నాడు. ఒక ఉన్నత రక్షక భటాధికారి జైలు సెల్లులో అతణ్ని ప్రశ్నిస్తున్నాడు.

"నీ పేరేమిటి?"

"మానవుడు?"

"ఓహో అలాగా పశువ్వి అనుకున్నాను. మనిషివే అన్నమాట. సరే, నీ ఊరేమిటి?"

"ప్రపంచం."

"అదో ఊరి పేరుకాదు. అతి తెలివిగా జవాబు నివ్వడంమాని, నువ్వే ఊళ్ళో పుట్టావో ఆ ఊరి పేరు చెప్పు."

"ఆ ఊరిని మీవాళ్ళెప్పుడో నేలమట్టం చేశారు."

"నేలమట్టం చెయ్యకముందు దానికో పేరు లేదూ?"

"ఉంది: ప్రపంచంలో కుగ్రామం."

"ఇక నిన్ను ప్రశ్నించి లాభంలేదు. ఇదిగో చూడబ్బాయి: నువ్వు కుర్రవాడివి. బ్రతికి బాగుపడవలసినవాడివి. దేశానికి నీ లాంటి యువకులెంతో అవసరం. నా మాట విని——''

"విని, మా రహస్యాలు మీకు చెప్పేస్తే, మా వాళ్ళందరికీ ద్రోహంచేస్తే నాకు మంచి ఉద్యోగం యిస్తారు. నన్ను మీ మార్గంలో బాగుచేస్తారు. అంతేకదూ? యూ స్కౌంక్!"

లాఠదండాల చేతులు పోలీసు ఉద్యోగి నెత్తిమీద పడబోయాయి.

ఇలాంటి అఘాయిత్యం ఏదో జరుగుతుందని అనుకుంటూనే ఉన్న పోలీసు ప్రముఖుడు నేర్పుగా తప్పించుకున్నాడు. ఇద్దరు జవాన్లను లోనికి రమ్మన్నాడు. పోలీసు స్టేషన్‌లో నిర్బంధితుణ్ని చంపకూడదంటూ, "బైటికి తీసుకెళ్ళి వీణ్ని కాల్చెయ్యండి" అని ఆర్డరు వేశాడు.

పూర్తిగా చీకట్లుపోని, బాగా వెల్తురు రాని సమయం అది. అప్పుడు వీరుడు సంతోషపూర్వకంగా తుపాకి గుళ్ళను స్వీకరించాడు.

ఆ చీకట్లో అతనికేవో వెలుతురు కిరణాలు కనిపించాయి. అవి తాను చదువుకునే గదిలో పెట్టుకొన్న మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, స్టాలిన్, మావోల వర్ణ చిత్రాలు.



కరాటే శిక్షకునికి

# ప్రతి అవయవమూ ఒక ఆయుధమే!

అన్ ప్రెసిడెంటెడ్ (అపూర్వం) అన లేముగాని, అద్భుతం అనగలం 'ఎంటర్ ది డ్రాగన్' అన్న ఆంగ్ల చిత్ర విజయాన్ని వర్ణించాలంటే. పోరాటంలో ఒక కళగా వర్ణించదగ్గ 'కరాటే' గొప్ప దనాన్ని చూపించిందా చిత్రం. ఆ చిత్రం వచ్చాక ఆ చిత్ర కథానాయకుడు బ్రూస్‌లీ బొమ్మలు గది గోడలపైనా, పత్రికల ముఖచిత్రాలపైనే కాదు—ఆధునిక నాగరి కతకు చిహ్నంగా నిలుస్తూ ధరించే దుస్తులపైకికూడా ఎక్కాయి.

ఆయుధరహితంగా, మనిషి తనను తాను రక్షించుకోగలిగేలా చేస్తుందని చెప్పబడే యీ కరాటే కథాకమామీషూ తెలుసుకోవాలని మీకు మాత్రం అన్పిం చదూ?

ఆ వివరాలు ఈ ఇంటర్వ్యూలో తెలు స్తాయి.

దేశికన్ కరాటే శిక్షకులు. మద్రాసు నగరంలోనే కాక, దక్షిణాదిన మరికొన్ని నగరాలలోకూడా శిక్షణాలయాలు నడుపు తున్నాడు. మలేసియానుండి చదువు కొనేందుకు భారతదేశం వచ్చి, కరాటే శిక్షకుడుగా స్థిరపడ్డ దేశికన్ వయసు 24 సంవత్సరాలేనని తెలిసి ఆశ్చర్యపోయాను. అంత చిన్నవయసులో ఈ కళలో గణ నీయమైన స్థాయిని చేరి 'బ్లాక్ బెల్ట్' సాధించిన యువకుడితను.

కరాటే శిక్షణ పొందుతున్నవారు "హూహా ..హూహా" అంటూ గట్టిగా అరుస్తూండటం యెందుకో నా కర్థం కాలేదు.

"కరాటేలో అవసరమైన చురుకైన కదలికలకు శరీరాన్ని సిద్ధపరిచి మనిషిని ఆ మూడ్‌లోకి తెచ్చేందుకు అలా అరుపులు అవసరమే"నని వివరించారు దేశికన్.

"కరాటే అంటే ఏమిటి?" అన్నాను. ఇంగ్లీషు నేర్చుకొన్న కొత్తలో "వాట్ ఈజ్ యువర్ నేమ్?" అని అడిగేందుకు ఎంత ఆత్రపడతామో అలా ఇంటర్వ్యూకి నాంది ఎలా పలకాలా అన్న ఆత్రంలో వెళ్ళిన వెంటనే అడిగిన ప్రశ్న ఇది.

కరాటే అంటే 'ఎంప్టీ హాండ్ కంబాట్' అని చెప్పారాయన "నిరాయుధంగా జరిపే పోరాటం" అని చెప్పుకోవచ్చు దీన్ని. అయితే 'హాండ్' అన్న పదం ఉన్నా కరాటే పోరాటం నేర్చుకొంటున్న విద్యార్థుల్ని చూస్తే చేతులేకాదు శరీరం లోని ఇతర అవయవాల్నికూడా ఈ పోరా టానికి ఉపయోగిస్తున్నట్లుగా కనపడింది నాకు. ఆ అనుమానమే వ్యక్తపరిచాను.

"మీరు చెప్పింది నిజమే" నన్నాడు దేశికన్. "కరాటే నేర్చుకొన్నవారి ప్రతి అవయవమూ ఒక ఆయుధమే" అని

కరాటే శిక్షకుడు దేశికన్‌తో ఇంటర్వ్యూ



పొట్టిగా, బలంగా, చురుగ్గా వున్న దేశికన్ రెండుమూడు రకాలుగా శరీరంలోని అవయవాలు ఎలా ఆయుధాలుగా ఉపయోగించబడతాయో ప్రదర్శించి చూపించారు (అదృష్టవశాత్తూ అది కేవలం ప్రదర్శనే గనుక, పోరాటం కాదు గనుక ఎవరికీ బలమైన దెబ్బలు తగల్లేదు) భారతదేశంలో పుట్టి (కేరళలో కలారిపాయత్ పేరుతో ఉండేదట). చైనా మీదుగా జపాన్, మలేసియా, సింగపూర్‌లు చేరుకొన్నదీ కళ.

చైనాలో కుంగ్‌ఫూగా చెప్పబడుతున్నది. జపాన్‌లో కరాటేగా పిలువబడుతున్నదీ కళ.

ఈ కళకు సంబంధించిన శిక్షణాలయాలను 'దోజో' అంటారు. కరాటే నేర్చుకొంటున్నవారూ, శిక్షకుడు కూడా ఆ ప్రదేశాన్ని అతి పవిత్రంగా చూసుకొంటారు.

నేను ఇంటర్వ్యూ చేస్తుండగా దేశికన్‌తో మాట్లాడేందుకు వచ్చిన విద్యార్థులు హఠాత్తుగా రెండు అడుగుల దూరాన ఆగి చిత్రంగా వంగి మళ్ళీ మామూలుగా నిలబడి మాట్లాడుతుండటం గమనించాను. నా కర్థంకాలేదు.

"అది 'కరాటే' శిక్షణ పొందుతున్నవారు, పొందినవారుకూడా ఒకరికొకరు పెట్టుకొనే వందనం." దేశికన్ నా అనుమానాన్ని గ్రహించినట్లుంది, అడక్కముందే చెప్పారు.

"మీ శిష్యులు రంగురంగుల బెల్టులు పెట్టుకొన్నారేమిటి? అదీ యూనిఫారంలో భాగమా, అందంగా వుండటానికా?"

జరుగుతున్న కరాటే క్లాసుచూస్తూఅడిగాను.

దేశికన్ నవ్వి అన్నారు "కరాటే కళలో బెల్టులు కరాటే శిక్షితుని స్థాయిని తెలుపుతాయి. ప్రాథమిక, మధ్యమిక, రాష్ట్ర భాష అంటూ హిందీలో పాండిత్యం పెంచుకొన్నకొలదీ మనం సంపాదించే గ్రేడ్స్‌లాగా, వైట్ బెల్ట్‌తో ప్రారంభమయి, వరుసగా గ్రీన్, బ్లూ, పర్పుల్, బ్రౌన్ 4, బ్రౌన్ 3, బ్రౌన్ 2, బ్రౌన్ 1, లు సాధించాక లభిస్తుంది బ్లాక్ బెల్ట్. బ్లాక్ బెల్ట్ స్థాయివరకూ కరాటే పోరాటంలో ఏ ఆయుధాలూ వుపయోగించరు. ఆ తర్వాత ప్రత్యేకంగా రూపొందించబడ్డ కొన్ని ఆయుధాలు మాత్రం ఉపయోగిస్తారు ఈ పోరాటంలో."

"ఆయుధరహితులైనా ఈ పోరాటం నేర్చుకొన్నవారు చీటికీ మాటికీ కోపమొచ్చినప్పుడల్లా ఎదుటి వ్యక్తుల్ని "హూహా" అంటూనే కాళ్ళూ చేతులు విరగ్గొట్టేయగలరుకదా. మరి సమాజానికి ప్రమాదంకాదూ మీవల్ల"కొంచెం ఆందోళనగానే అన్నాను. దూరంగా కరాటే నేర్చుకొంటున్న వారి కదలికలు చూస్తుంటేనే భయంవేసింది నాకు.

"లేదు లేదు. ఈ కళను వ్యర్ధపరచమనీ, స్వప్రయోజనాలకూ, స్వార్ధాలకూ ఉపయోగించుకోమనీ ప్రమాణంతోనే ఈ పోరాటం నేర్చుకోవడం మొదలుపెడతారు. ఎక్సెప్షన్స్ ఉండొచ్చేమోగాని మీరన్న భయంలేదు"కొంచెం గంభీరంగా జవాబిచ్చారీసారి ఆయన.

దేశికన్ కరాటే కళను భారతదేశమంతా వ్యాప్తి చేసేందుకు కృషి చేస్తున్నారు. త్వరలోనే హైదరాబాద్‌లో ఒక శిక్షణాలయం నెలకొలపాలని ఉన్నట్లు చెప్పారు. అవకాశమొస్తే చలనచిత్రాలలో ఈ కళను ప్రదర్శించేందుకు ఉత్సాహం కలిగి వున్నారు.

ఇంటర్వ్యూ ముగిశాక లేచి సెలవు తీసుకోబోతూ ఆగి కొంచెం వంగి కరాటే పద్ధతిలో అభివాదం చేసేందుకు ప్రయత్నించాను. నాకే నవ్వొచ్చింది

నా భుజం తట్టి "ఫర్వాలేదు .మీరలా చేయనవసరంలేదు" అని ఫక్కున నవ్వి క్లాసు తీసుకొనేందుకు వెళ్ళారు

"హూహా హూహా" అంటూ అరుపుల స్థాయి పెరుగుతోంది నేను బయటికొస్తూండగా

కరాటే శిక్షణ పొంది ఆత్మవిశ్వాసం పెంచుకొనే భారతపౌరులుగా తయారయే కార్యక్రమం కొనసాగిస్తున్నా రక్కడి స్టూడెంట్స్.

ఇంటర్వ్యూ ముగించి వస్తూండగా అనిపించింది నాకు "ఆడదానికి రక్షణ కల్పించడానికి ప్రధానంగా, భారతదేశంలో స్త్రీలందరూ విధిగా కరాటే నేర్చుకు తీరాలన్న చట్టం వస్తే బాగుంటుంది" అని. ఈ సూచన సహించక___

"ఏమయ్యో .మా ఆడవాళ్ళ నోటి మాటకే తట్టుకొని నిలవలేకపోతున్నాము. ఈ కరాటేకూడా నేర్పిస్తే మే మేమవుతామనుకొన్నావ్" అంటూ కళ్ళెర్రజేసి పురుషలోకం నా మీదకొచ్చే అవకాశమున్నా, 'కరాటే' నేర్చుకొన్న స్త్రీలోకం నన్ను కాపాడకపోతుందా అన్న నమ్మకం ఉండటంతో ధైర్యంగా చేసేశానీ సూచన.

—వేమూరి సత్యనారాయణ

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | | 4 | 5 | | 6 |
| | | 7 | | | 8 | | | |
| 9 | 10 | | 11 | | | | 12 | |
| | 13 | 14 | | | 15 | 16 | | |
| 17 | | | | 18 | | | | |
| | | 19 | 20 | | 21 | | 22 | |
| 23 | | | 24 | | | | 25 | 26 |
| | | 27 | | | 28 | 29 | | |
| 30 | | | | | | | | |

ఆధారాలు

మే '77

## అడ్డం

1. ఎక్కడుంది రాజమండ్రీ
7. దైత్యుల తల్లి
8. ధాన్యం అందరిలోలేదు. ఎవరిలోనో ఉంది.
9. శ్రీకారంతో ఒక దేశం
11. పూర్వజన్మల కిది ఉంటుందట.
12. సుమీ అని కూడా అనవచ్చు
13. సిద్ధాంతపూర్వ పక్షాలు?
15. తక్కువ, లోటు
19. తమరు జబ్బుపడితే ఏముంది?
21. పేదవాడు తిరగబడ్డ రికాబి!
23. తినగా తినగా తీపు
24. ద్వయం
25. పడినా, చేసినా మోసమే!
27. సుడి (వెనుకబడి)
28. సూయి (తిరగబడి)
30. శ్రీశ్రీ కల్పన

## ఏప్రిల్ 77 'పదబంధ ప్రహేళిక'కు సమాధానం:

**అడ్డం:** 1. సనకసనందనాదులు 7. రామ 8. హరి 9. దారి 11. వలెను 12. కాలు 13. క్రవర్తి 15. డుడు 19. సతి 21. సమరం 23. ప్రభ 24. లోసత్యం 25. గురి 27. దుత్త 28. వగ 30. సరిగమపదనిసలు.

**నిలువు:** 1. సరిదా 2. కరా 3. సమవర్తి 4. దహనుడు 5. నారి 6. లులులులులు 10. రిక్క 14. వరుస 16. డుడుమ 17. పద్మప్రభాస 20. తిలోత్తమ 21. సత్యంవద 22. రంగు 26. రిక్తులు 27. దుగ 29. గని.

ఏకాక్షరపదం: 18. కం.

## నిబంధనలు మరవకండి!

ఎంట్రీలు కొట్టివేతలూ, దిద్దుబాటులూ లేకుండా జ్యోతిలోని పదబంధ ప్రహేళిక లోనే నింపిపంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీలలో లాటరీవేసి ఒక్కరికి తెలుగు నిఘంటువూ, మరో పదిమందికి ఆ నెల జ్యోతి కాపీలు పంపబడతాయి. ఆల్ కరెక్ట్ పంపిన పాఠకులందరి పేర్లూ జ్యోతిలో ప్రకటిస్తాము. ఎంట్రీలు చేరవలసిన ఆఖరు తేది 1-5-77.

---

## ఏప్రిల్ 77 పదబంధ ప్రహేళిక విజేత శ్రీ శ్రీ!

ఏప్రిల్ 77 పదబంధ ప్రహేళికకు ఆల్ కరెక్ట్ సమాధానం ఒక్కటి కూడా రాలేదు. ఈ నెల బహుమతి, వచ్చే నెల బహుమతీ కలిసి వచ్చే నెల ఆల్ కరెక్ట్ ఎంట్రీలలో రెండింటికి నిఘంటువు బహూకరిస్తాము.

---

### నిలువు

1. రేపల్లె ఆవుల మంద
2. 20లో సగం
3. ఒక అలంకారిక మతం.
4. ఆశీస్సులు
5. సమయం
6. అప్పుడే పుట్టిన శిశువు వయస్సు కావచ్చు
10. . అనునామంబు నీటి కాకికి లేదే!
14. కొనగోళ్ళకు పెద్దనార్యుని విశేషణం.
16. గులేబకావళిలో ఊరు తిరగబడింది.
17. పర్యవేక్షణ (తిరగబడింది)
20. నేటి సినిమాతార
21. ఒక సంవత్సరం (అటునుంచి ఇటు)
22. ఋషభం, దైవతం
26. తినగా తినగా చేదు
27. ఇంది బోర్లా పడింది.
29. విరహం.

### ఏకాక్షర పదం

18. ఇంగ్లీషులో అలాగా కాని హిందీలో అబద్ధం కాదు.

# పలు రంగాలలో ఆంధ్రప్రముఖులు

నెలకు రెండు రూపాయల జీతంతో జీవితం ప్రారంభించి, కోట్ల రూపాయల వ్యాపారం చేసే యాదాలం అండ్ కో అన్న సంస్థకు మానేజింగ్ పార్ట్నర్ స్థాయికి ఎదిగిన ఘనుడు శ్రీ ఎల్. వి. రామయ్య. నలభై సంవత్సరాలుగా ఆయిల్ సీడ్స్, ఆయిల్ కేక్స్ వ్యాపారంలో అనుభవం సంపాదించి, సంపాదించిన అనుభవంతో డబ్బు సంపాదించిన శ్రీరామయ్య, సంపాదించిన డబ్బుకి మరింత విలువ కలుగజేస్తూ ఎల్. వి. ఆర్. ఛారిటీస్ పేరిట సాంఘిక సేవా లక్ష్యంతో ఒక సంస్థను స్థాపించారు.

అనంతపూర్ జిల్లాలో 'గుండు' అన్న గ్రామంలో జన్మించిన శ్రీరామయ్య వయసు ఇప్పుడు 55 సంవత్సరాలు. ఆయన జీవితంలో విజయం పొందేందుకు కాలేజి చదువులూ, డిగ్రీలూ కాదు సాయ పడింది, పట్టుదలతోనూ, క్రమశిక్షణతో ఆయన పడ్డ నిరంతరమైన శ్రమే ఆయన్ని స్థాయికి పెంచింది. "ఏ రంగంలోనైనా విజయం సాధించేందుకు కష్టించి పని చెయ్యడం ప్రధానంగా కావలసిన అర్హత" అంటారీయన. తనుపడ్డ కష్టానికి ఫలితం లభించి ఈనాడు విజయం సాధించిన వ్యాపారవేత్త స్థాయికి ఎదిగినా, డబ్బు సంపాదించుకొన్నా, సాటి మానవులందరూ కూడా సుఖంగా వుండాలని కోరుకోవడమే కాక, అలా తన చుట్టూవున్న వారికోసం తనకు చేతనయినంతలో కృషి చెయ్యడం మానని మానవతావాది శ్రీరామయ్య. పెద్దగా చదువుకోని శ్రీరామయ్య సంతానమంతా పెద్ద చదువులే చదివారు. పెద్ద కొడుకు ఇంజనీర్, రెండోకొడుకు సైన్సు పట్టభద్రుడు, మూడవ కుమారుడు కామర్సు పట్టభద్రుడు. అంతేకాదు, ఉన్న ఇద్దరు ఆడపిల్లలూ కూడా గ్రాడ్యుయేట్లే. విమర్శలను కూడా సంతోషంగా ఆహ్వానించే శ్రీరామయ్య "నిజం మాట్లాడటమూ, న్యాయంగా వుండటమూ, బాధ్యతలు నెరవేర్చడంలో కాలయాపన చెయ్యకుండా వుండటమూ, అందరికీ మంచి జరిగేలా కోరుకోవడమూ" మరిచిపోవద్దన్నారు యువకులకు మీరేం సలహా ఇస్తారంటే.



శ్రీరామయ్య జీవితం-నిరుత్సాహంతో, నిస్పృహతో గడుపుతున్న ఎందరో యువకులకు ఉత్తేజకరంగా నిలుస్తుంది. కష్టించి పని చెయ్యడమే ప్రధానంగా జీవితంలో ముందడుగు వెయ్యండి — అందరూ శ్రీరామయ్య స్థాయికి ఎదగడమన్నది కష్టసాధ్యమయినా-కష్టానికి తగ్గ ప్రతిఫలం లభించక పోవడం మాత్రం జరగదు.

—పి. సరళా సూర్యారావు

# సినిమా

'థ! కథ! కథ కావాలి!

"సినిమా ఎప్పుడు సార్"

"అంతా సిద్ధమేనండీ కథ.....కథ దొర ాలి, కథ కోసమే వెదుకుతున్నాను."

చాలా తరచుగా విన్పించే సంభాషణ ది చిత్ర పరిశ్రమలో. నిర్మాత మంచి 'థ కోసం నిరంతరం అన్వేషిస్తూనే ంటాడు. చివరకు చాలా 'మంచి కథ' నుకొన్నది దొరుకుతుంది. అంతకు ుందే నిర్ణయమయిన తారలు కొంత మందినీ, కొత్తగా నిర్ణయించుకొన్న తారలు కొంతమందినీ చేర్చి కొన్ని నెలల పాటు నిర్మాణ కార్యక్రమంలో మునిగి పోతాడు నిర్మాత. సినిమా తయారవు తూంది. ప్రేక్షకుల ముందుకొస్తుంది.

సినిమా ప్రేక్షకులముందు కొచ్చాక గానీ కథలో బలం లేదన్న సంగతో, అసలు ఆ సినిమాలో కథే కనపడటం లేదన్న సంగతో బయటపడటం లేదు. అప్పటికే నిర్మాతవీ, డిస్ట్రిబ్యూటర్లవీ,



'ఎదురీత'లో రామారావు, వాణిశ్రీ



"ప్రతిజ్ఞ"లో శోభన్‌బాబు, జయసుధ

్రతికల వాళ్ళ ప్రకటనలవీ చాలా డబ్బు ి 'కథ'లో మునిగిపోయి వుంటుంది. ాలా సందర్భాల్లో తేలను కూడా తేల ంటుంది.

సినిమా కథలు ఎందుకు బాగుండటం లేదు? కథా రచన చేస్తున్న తరుణంలో గాని, (ఎక్కువ సినిమా కథలు 'తయారు చేయబడతాయి' దానినే 'వండటం'నీ కూడా పిలుస్తున్నారు కొందరు హాస్యప్రియులు), ఆ కథను సినిమాకు మలచడం జరుగు తున్నప్పుడు గానీ, దానికి అవసరమైన కృషి జోడించటం లేదు. నటీనటులూ, వారి కాల్షీట్లూ, వారి కాస్ట్యూమ్స్, కథలో క్లబ్ డ్యాన్స్ ఎక్కడ ఇరికించాలన్న ఆలోచనలూ, డ్యూయెట్ పాడటానికి ముందు నారదిగా ఆ సన్నివేశాన్ని ఎలా చూపించాలన్న విషయంగా చర్చలూ— వీటికే ఎక్కువ ప్రాధాన్యత నిస్తున్నా రేమో నన్పిస్తోంది.

మంచి కథతో మొదలు పెట్టబడిన చిత్రం, విజయం కావడానికి యాభై శాతం అర్హత సంపాదించుకొన్నట్లే నన్నది అందరూ వప్పుకొనే సత్యమే అయి నప్పుడు మరి ఎందుకు కథల ఎడ నిర్లక్ష్యం.

తెలుగు సినిమా నిర్మాతలు, మంచి తెలుగు నవలల నెందుకు చిత్రాలుగా తీయరూ? అన్న విమర్శ ఉండేది ఒకప్పుడు. ఆ విమర్శకుల నోళ్ళు మూతలు వేయించారు, తెలుగు నవలా సాహిత్యాన్ని గుర్తించి నవలా చిత్రాలు మొదలుపెట్టిన కొందరు నిర్మాతలు.

ఈ పరిణామం అసలుకే మోసం తెస్తుం దనుకోలేదు ఎవరూ! ఇప్పుడు నిజంగానే అసలుకే మోసం వచ్చిందనే చెప్పాలి.

నవలలు ఎక్కువ సంఖ్యలో చిత్రాలుగా



''అడవిరాముడు''లో జయప్రద, జయసుధలతో ఎన్.టి.ఆర్.

రావడంతో, నవలలు రాసే వారి సంఖ్య తగ్గిపోయింది. సినిమా తీస్తారనీ, ఆ సినిమాలో నాగేశ్వరరావో, రామారావో, కథా-నాయకుడనీ, వాణిశ్రీయో, జయసుధో కథానాయకి అనీ, ప్రక్కనున్న మిత్రుడి పాత్ర శ్రీధరో, చంద్రమోహనో వేస్తారనీ ఇలా ముందే ఒక చలనచిత్రాన్ని ఊహించి రాసేస్తున్న నవలలొస్తున్నాయి. నిర్మాతలూ, రచయితలూ—ఈ విషయం కొంచెం తీరికగా ఆలోచించి చూడండి!



''జీవనతీరాలు'' కృష్ణంరాజు, వాణిశ్రీ

... ... ... ప్రముఖ ఆడిటర్ పర్వతనేని బ్రహ్మయ్య, సినీ నటి కాంచన, హాస్య నటుడు అల్లు రామ లింగయ్య, నటుడు కాంతారావు ప్రసంగించారు. కళావాహిని చైర్మన్ కృష్ణమూర్తి స్వాగతం పలికారు. కళా వాహిని సెక్రటరీ పి. ఎస్. బాబు అభి నందన పత్రం చదివారు. కళావాహిని నిర్వహించిన బిల్డింగ్‌ఫండ్ లక్కీ డిప్ విజేతలకు నాగేశ్వరరావు బహుమతులంద జేశారు. నాగేశ్వరరావు తనకు జరిపిన సన్మానానికి ఉచిత రీతిని సమాధానం చెప్పారు.



''చిలకమ్మ చెప్పింది''లో సంగీత

## కళాప్రపూర్ణుడైన అక్కినేనికి కళావాహిని సన్మానం!

మద్రాసులోని సాంస్కృతిక సంస్థ కళావాహిని, అక్కినేని నాగేశ్వరరావును మార్చి 27 న సన్మానించింది. ఆంధ్రా యూనివర్శిటీచే కళాప్రపూర్ణ (గౌరవ డాక్టరేట్)గా గౌరవించబడ్డ సందర్భంలో ఈ సన్మానం జరిగింది. సభకు జస్టిస్ రామప్రసాదరావు అధ్యక్షత వహించారు. అక్కినేని నాగేశ్వరరావుతో పాటు చిత్ర పరిశ్రమలోని చాలామంది తారలు కూడా వేదిక నలంకరించారు. అక్కినేనిని అభి నందిస్తూ దర్శకుడు పుల్లయ్య, దర్శకుడు

## ''చిల్లరకొట్టు చిట్టెమ్మ''

దాసం గోపాలకృష్ణ నాటకం చిల్లర కొట్టు చిట్టెమ్మ' చిత్ర రూపానికి మార్చి 20న పాటల రికార్డింగ్‌తో ప్రారంభో త్సవం జరిగింది. కథానాయకిగా జయచిత్ర నటిస్తున్న యీ చిత్రానికి దర్శకత్వం దాసరి నారాయణరావు. లక్ష్మీజ్యోతి ఫిలిమ్స్ పతాకంక్రింద ఆర్. ఎస్. రాజు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్నారీ చిత్రాన్ని.

## ప్రేమించి పెళ్ళి చేసుకో!

తాను ప్రేమించిన యువతినా! తనను ప్రేమించిన యువతినా! ఎవర్ని చేసు కొంటాడు కథానాయకుడు. చక్కని ప్రేమ కథకు అతి చక్కని చలనచిత్ర రూపకల్పనగా తయారైంది "ప్రేమించి పెళ్ళి చేసుకో". మురళీమోహన్ రావు గోపాలరావు, గిరిబాబు, సారధి, ముక్కా మల, జయచిత్ర, రమాప్రభ, ఛాయాదేవి మొదలైనవారు నటించిన ఈ చిత్రాన్ని కె. హేమాంబరధరరావు దర్శకత్వంలో కె. మహేంద్ర నిర్మించారు.



“బంగారు బొమ్మలు”లో మంజుల



''ఈనాటి బంధం ఏనాటిదో''లో కృష్ణ, జయప్రద

## పుట్టిన రోజులు !

సినీనటుడు రామకృష్ణ తమ కుమారుడు శ్రీనివాస్ నాల్గవ పుట్టినరోజు పండుగను 23-3-77న తమ స్వగృహంలో జరిపారు.



''తొలిరేయి గడిచింది''లో జయచిత్ర

వర్ధమాన తార జయప్రద తన పుట్టిన రోజు పండుగను మార్చి 27 న జరుపుకొంది.

మార్చి 12 న నటి దీప (అసలు పేరు ఉన్నీమేరీ) తన పదిహేనవ పుట్టినరోజు జరుపుకొంది.

## శత దినోత్సవం !

కె. విశ్వనాథ్ దర్శకత్వంలో చంద్రమోహన్, జయప్రదలు ప్రధానపాత్రలలో నటించిన సిరిసిరి మువ్వ చిత్రం శత దినోత్సవం జరుపుకొంది. డా॥ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతన మార్చి 27 న మద్రాసులో జరిగిన శతదినోత్సవ సభలో నేపథ్యగాయని ఎస్. జానకి ద్వారా మెమెంటోలు అందజేయబడ్డాయి. హాస్యనటుడు రాజబాబు సభానిర్వహణ చేశారు.



కళావాహిని సాంస్కృతిక సంస్థ అక్కినేనిని సన్మానించిన సందర్భంలో ఆ సంస్థ తరఫున సన్మానితునికి మెమెంటో బహూకరిస్తున్న జస్టిస్ రామ్‌ప్రసాద్

సుగుణా పిక్చర్స్ చిత్రం!

సుగుణా పిక్చర్స్ పతాకం క్రింద అక్కినేని. వాణిశ్రీలు కథానాయకా,నాయికలుగా ముప్పలనేని శేషగిరిరావు నిర్మిస్తున్న వర్ణచిత్రంలో జగ్గయ్య. కాంచన, విజయలలిత, జయమాలిని, హలం మొదలగువారు నటిస్తున్నారు. వి. మధుసూదనరావు స్క్రీన్‌ప్లే దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

'ఉమాదేవి ఫిలిమ్స్'

పై బేనరుపై డా॥ పి. వి. చంద్రశేఖర్, కె. సత్యం దర్శకత్వంలో నిర్మిస్తున్న చిత్రానికి పాటల రికార్డింగు జరిగింది. మురళీమోహన్, జయచిత్ర నాయకా నాయికలుగా నటిస్తున్న యీ చిత్రానికి కె. వి. మహదేవన్ సంగీత దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

'వాణీ విజయం'

వై. రామచంద్రరావు నిర్మించిన 'వాణీ విజయం' చిత్రంలో శివాజిగణేశన్, జయలలిత, సుందరరాజన్, నంబియార్, నాగేష్, జానకి, చంద్రబాబు నటించారు. దర్శకత్వం: ఎ. భీమ్‌సింగ్.

'కరుణామయుడు'

రాధికాచిత్ర నిర్మిస్తున్న వర్ణచిత్రం 'కరుణామయుడు'—క్రీస్తు జీవితచరిత్రను (ఆనాటి సాంఘిక, రాజకీయ జీవితాల చిత్రను ప్రధానంగా) చూపించే చిత్రం. ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన ప్రెస్ మీట్‌లో ఆ చిత్రం విశేషాలు వివరించారు నిర్మాత విజయచందర్, దర్శకుడు ఎ. భీమసింగ్, రచయిత మోదుకూరి జాన్సన్, కో డైర

క్టర్ క్రిస్టఫర్ కొహిలో. విజయచందర్ క్రీస్తుగా నటిస్తున్న ఈచిత్రంలో జగ్గయ్య, చంద్రమోహన్, త్యాగరాజు, మిక్కిలినేని, వెన్నిరాడై నిర్మల మొదలగువారు నటిస్తున్నారు.



"బంగారక్క"లో మురళీమోహన్

## కన్య—కుమారి !

ఒక వ్యక్తి మనస్తత్వం. ఒక వనిత ఊహాగానం. ఒక విధవ హృదయ దౌర్భల్యం యీ మూడింటి సమ్మేళనంగా 'కన్య—కుమారి' చిత్రం దాసరి నారాయణ రావు దర్శకత్వంలో రాబోతుంది. శ్రీవిద్య జయమాలిని, నరసింహరాజు, రమాప్రభ శరత్‌బాబు నటిస్తున్నారు. టి కాశి పి. నారాయణరావు నిర్మాతలు.

## ఇదెక్కడి న్యాయం !

దాసరి నారాయణరావు దర్శకత్వంలో తయారయి విడుదలకు సిద్ధమై వున్న చిత్రం 'ఇదెక్కడి న్యాయం', ఐ వి యస్ అచ్యుతవల్లి నవల ఆధారంగ నిర్మిత మయిన ఈ చిత్రంలో మురళీమోహన్ నరసింహరాజు, మోహన్‌బాబు రావి కొండలరావు, జయసుధ, ప్రభ జయ మాలిని మొదలైనవారు నటిస్తున్నారు జి. జగదీష్ చంద్రప్రసాద్ నిర్మాత

## తరం మారింది

అంతరాలు అంతరంగాలు మారాలనే అభ్యుదయ భావంగల కథావస్తువుతో నిర్మితమైంది విశ్వభారతీ మూవీస్‌వారి 'తరం మారింది' చిత్రం. శ్రీధర్ పల్లవి, దాశరథి, శోభ, లక్ష్మీకాంత్ రాజకుమారి నటించిన ఈ చిత్రానికి సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు నిర్మాత జి రాధాకృష్ణమూర్తి.

—యస్వీ నారాయణ

FREE!! 

# సృష్టికి మూలం దేవుడు

ఉచితం!

పరిణామ సిద్ధాంత ప్రకారం ప్రాణికోటి అంతా ఒక్కసారే సృష్టింపబడడం జరగలేదు. లక్షోపలక్షల సంవత్సరాలకు పూర్వం ప్రకృతి శక్తులు జడపదార్థ ప్రక్రియలకు లోనైనపుడు ఆకస్మికంగా సూక్ష్మశరీరం గల జీవి జన్మించినట్లు, క్రమేపి అది వృద్ధిచెంది స్థూలశరీరంగల జీవులు వుద్భవించినట్లు చిట్టచివరకు మానవుడు కూడ వాటినుండి వుద్భవించినట్లు ఆ సిద్ధాంతం చాటుతుంది. ఇది ఎంత అవివేకం? ఇనుప ముక్కలు, రబ్బరు గొట్టాలు పోగుచేసి ఒకచోట కుప్పగా పోసి, అది ఒక ధూమ శకటం తయారు కాగలదని అనుకోటం ఎంత వెర్రితనమో కదా! సృష్టికర్త లేక ఈ సృష్టి కలిగిందనుకోడం అంతా వెర్రితనమే. Lens కనుగొన్న Zeiss మరియు, Film కనుగొన్న Kodak చాలా మేధావులని అందరూ మెచ్చుకుంటూరు. అయితే దేవుడు ప్రతి మానవుని కళ్ళల్లోనూ ఒక Camera ను అమర్చివున్నాడు. Zeiss, Kodak వీరు గొప్ప వ్యక్తులని పరిగణింపబడితే ఈ సున్నితమైన Camera మానవుని శిరస్సులో అమర్చిన వ్యక్తి మరి గొప్పవాడు కాడా? ఇంక మానవుని చెవులు Birliner కనుగొన్న Microphone కన్న సున్నితమైనవి కాదా? ఈ Camera Telephone, Gramphone, Microphone మానవులు నిర్మించకపోతే వాటంతటకవే ఆకస్మికంగా ఏర్పడలేవని విశ్వసిస్తున్న ఈ నాస్తికులు, మా మానవ దేహములో కళ్ళు, చెవులు, నరాలు పనిచేస్తున్న తీరునుబట్టి వీటిని సృష్టించిన మహా మేధావి ఒకడు తప్పక వుండి తీరాలని ఎందుకు విశ్వసించరో? దేవుడులేడని బుద్ధిహీనులు తమ హృదయంలో అనుకుందురని "Bible"లో వ్రాయబడియున్నది. సత్యాన్ని పరిశోధించి తెలుసుకొనలేకనే, వాస్తవాన్ని గుర్తించకనే దేవుడులేడని చెప్పేవారంతా మూర్ఖులు కారా?

"ఆకాశము దేవుని మహిమను వివరించుచున్నది. అంతరిక్షము ఆయన చేతిపనిని ప్రచురపరుచుచున్నది." "ఆయన కలుగచేసిన చంద్ర నక్షత్రములను చూడగ దేవుడు మనుష్యుని జ్ఞాపకము చేసికొనుటకు వాడేపాటివాడు." అంత గొప్ప దేవుడు ఈ మానవులను ప్రేమించి వారి రక్షణార్థం తన కుమారుని అనుగ్రహించియున్నాడు. ఆ దేవుని గూర్చి తెలుసుకున్నారా?

—చదలవాడ చంద్రమతీదేవి


ఎమ్ కె మావుళ్ళయ్య
సమర్పించు
శ్రీ లక్ష్మీనరసింహా కంబైన్స్
గీత సంగీత
నిర్మాతలు
చింతా బ్రాహ్మణరెడ్డి
బాగంటి బాపయ్య
దర్శకత్వం
ఎమ్.యస్.కోటారెడ్డి
తారకరామ
నవభారత్
శ్రీ తారకరామ

